శ్రీ పరమేశ్వరాయనమః

దివ్యవాణీ సుకృతిప్రాసాదము. 2 వ సుకృతి

# దర్శనదర్పణము

గ్రంథకర్త

చివుకుల అప్పయ్యశాస్త్రి,
(దివ్యవాణీ పత్రికాధిపతి)



శ్రీనివాస ప్రింటింగ్ వర్క్సు, సికింద్రాబాదు.

ప్రకాశకులు:

దివ్యవాణీ సుకృతి ప్రాసాదము,
సికింద్రాబాదు.

1945

 వెల: 1-4-0

* *

# దివ్యవాణీ సుకృతిప్రసాద

గ్రంథములను కోరువారీ దిగువవారికి వ్రాయ ప్రార్థితులు.

శ్రీరామా బుక్ డిపో.

4000 మార్కెట్‌స్ట్రీట్,

సికింద్రాబాద్-దక్కన్.

* *

*

# మనవి.

ఈ "దర్శనదర్పణ" మను గ్రంథము శ్రీ దివ్యవాణీ సుకృతిప్రాసాదమునుండి రెండవ సుకృతిగాఁ బ్రకటింపఁబడినది. ఇది సంస్కృతాంగ్ల హిందీ భాషావిశారదులును, సనాతన ధర్మోద్ధారకులు నగు శ్రీ దయానంద స్వాములవారి "సత్యార్థవివేక" మనెడి గొప్ప గ్రంథములోని కొంతభాగము మాతృకమైనందున శ్రీ స్వాములవారికి కృతజ్ఞతాపూర్వకానేక ప్రణామంబు లర్పించుచున్నాఁడను. ఇందలి మంచి చెడ్డలు పాఠకులకే వదలిపెట్టితి. ఇద్దానిని సహజౌదార్య సంపన్నులగు మహారాజశ్రీ చందా నారాయణశ్రేష్ఠిగారు ముద్రింపించి ప్రకటింపనిచ్చినందులకు శ్రీ శ్రేష్ఠిగారిని చిరాయురారోగ్యైశ్వర్యవంతునిగా రక్షించుగాతయని పరమేశ్వరసింబ్రార్థించుచున్నాను.

ఇట్లు,

సుజనవశంవదుడు,

చిప్రకుల అప్పయ్యశాస్త్రి

# విషయసూచిక.

శ్రీపరబ్రహ్మణేనమః.

# దర్శనదర్పణము.



శ్లో॥ "ఉచ్చై ర్గతి ర్జగతి సిధ్యతి ధర్మత శ్చే
త్తస్య ప్రమా చ వచనైః కృతకేతరై శ్చే
త్తేషాం ప్రకాశనదశా చ మహీసురై శ్చే
త్తా నంతరేణ నిపతే త్క్వను మత్ప్రణామః"

## వేదోపాంగములు.

బాహ్యజగదున్నతికి శిల్పసంబంధీయోన్నతి ప్రథమ సోపాన మని తలంచిన ట్లాంతర్జగదున్నతికి దార్శనికోన్నతి ప్రథమసోపాన మని యెంచవచ్చును. ఎట్లు రాజసీబుద్ధివికాసము, శిల్ప, కళా, ప్రభృతుల యున్నతిమూలమునఁ బ్రమాణితమగుచున్నదో యట్లే సాత్త్వికీబుద్ధివికాసము, దార్శనికోన్నతిద్వారమునఁ దెలియఁగలము. ప్రపంచములోనేయేజాతులు జ్ఞానోన్నతియం దగ్రేసరములగుచున్నవో వానిలో దార్శనికబుద్ధి యుదయించుట స్వతస్సిద్ధము. ప్రాచీనములగు ఆరేబియా, యీజిప్టు రోమను, జాతులలోను, నర్వాచీనములగు యూరోపు,అమెరికా,జాతులలోఁగూడ నేతజ్జ్ఞానపరిణామానుసారముగా దార్శనిక

జ్యోతిర్వికాసము యథాసంభావముగా నయియున్నది. కాని యార్య జాతిలోని దార్శనిక జ్ఞానావిర్భావమునకు వారి దార్శనికోదయము సాటిరాజాలదు. ప్రాచీనార్యజాతి యొక్కయు, నర్వాచీనాన్యజాతులయొక్కయు, దర్శన శాస్త్రములఁ దెలిసికొనినవారుమాత్రమే, యర్వాచీనము లగు నన్యజాతులు దమ దార్శనికవిచారమం దింతవఱకు వృద్ధ గురువగు భారతజాతిసన్నిధిలో నొకచిన్నవిద్యార్థిగానే యున్న వని సామాన్యముగా విచారించినమొదలను దెలిసికొనఁగలరు. ఈలోకమందు రెండుశక్తు లున్నవని తెలియుచున్నది. జడశక్తి యొకటి,చేతనశక్తి మఱియొకటి,శారీరకశక్తి యొకటి,జీవనశక్తి యిం కొకటి,ప్రకృతిశక్తి యొకటి, పురుషశక్తి వేఱొకటి.వీనిలో జడశక్తి స్థూలమును మఱియుఁజేతనశక్తి, యతిసూక్ష్మము న తీంద్రియ ము నై యున్నది. జడశక్తి రాజ్యము, జగత్సృష్టివిస్తారమందుఁ గలదు. చేతనభావరాజ్య మద్దానికంటెఁ బైనిఁగలదు. జడశక్తి సాధారణముగా ననుభవయోగ్యమై యుండును. గాని చేతన భావము జడరాజ్యములోని శేషసీమలోఁ బ్రవేశించినతరువాతఁ గేవల మనుమానించుటకుఁ దగినదిగా నుండును. ప్రస్తుతమం దర్వాచీనాన్యజాతులలో నెన్నిదర్శనశాస్త్రములు ప్రకటింపఁ బడినవో యవన్నియు నిప్పటికిని జడజగత్తునందే తిరుగుచున్నవి. వారు జడజగత్తులో విశేషముగా ననేకపరిశోధనములు గావించి

నప్పటికిఁ జేతనజగత్తును దూరమునుండికూడ నిరీక్షింపఁ జాల
కున్నారు. అర్వాచీనులగు నవ్యవిద్వాంసులన్ననో జడరాజ్య
ములో నేదో కొంతపరిశోధనమును జేసియున్నారు. అయినప్ప
టికి వారికి జడభావముకంటె వేఱైన చేతనభావ మొకటి
యున్నదా? లేదా? యను నీజ్ఞాన మింతవఱకుఁ గలుగలేదు. వారి
కిట్టిదశ యెప్పుడుండినదో, వారు ప్రకృతిరాజ్యములోనే తిరు
గుచు దానియందే సర్వవిషయములున్నవని తలంచిన ట్లెప్పుడు
గనుఁగొనుచున్నామో, యెప్పుడు పురుషుని సామాన్యజ్ఞానమాత్ర
కూడ వారికింతవఱకుఁ జిక్కియుండలేదని యెఱుఁగుచున్నామో,
యెప్పుడు జీవభావము, పురుషభావము, ఈశ్వరభావము,
బ్రహ్మభావమున్నగు చేతనజగత్తునకు సంబంధించిన యేభా
వముయొక్కయు యథార్థరూపము వారియూహలోఁ దట్టి
యుండనేలేదనియు, నింతవఱ కర్వాచీనులగు దార్శనికులు జడ
జగత్తులోని మాయారాజ్యమునందే పొరబాట్లఁ బడుచున్నా
రనియుఁ దెలిసికొనుచున్నామో యప్పు డింకను వారు దార్శనిక
జ్ఞానములో బాలకులేయని యేల విశ్వసింపఁగూడదు? అంతర్జ
గత్తునకు సంబంధించిన విచారరూపమహాసాగరమునకు రెండు
దరులు గలవు. ఈవిస్తారమైన సంసార మనునది యొకగట్టు.
బ్రహ్మసద్భావరూపమైన నిర్వాణపదము మఱియొకగట్టునై
యున్నది. ఈవిచారభూమిలో నొకటి సంసారరూప మింద్రియ

గమ్యవిషయమును, మఱియొకటి యతీంద్రియబ్రహ్మపదమునై యుండును. అర్వాచీనులగు దార్శనికులో, మొదటిగట్టునుండి కొంతముందునకుఁ బోయిరి. కాని యీవిస్తృతమగు మహాసముద్రమునఁ గొలఁదిదూరముదాఁక ముందుఁజని వెంటనే నిరాశగలవారలై తిరిగి వెనుకకుఁ జూడఁగడంగిరి. మఱియుఁ దమజ్ఞానశక్తి యసంపూర్ణమైనదగుటచేత వారీమహాసముద్రముయొక్క నాల్గువైపులందును, బూర్వభూమిసదృశమైనదియు, దృశ్యవిషయమయినదియు నగు సంసారమే యున్నదని తెలిసికొనమొదలిడిరి. వారికిఁ గేవల మొకతటమునసంగతియే విదితమగుటంబట్టివారు కేవలమిట్టిమహాజ్ఞానసాగరములోపల దిగ్భ్రమవశు లగుచున్నారు. ఈకారణమునుబట్టి యేమున్నదంతయు జడప్రకృతియే యని వారికిఁ దెలిసినది. ఇందుల కార్యజాతిలో నేప్రకారముగా జ్ఞానావిర్భావమయ్యెనో యాప్రకారముగా నర్వాచీనులయందుఁ గాకపోవుటయే ప్రధానకారణమై యున్నది. ఆర్యజాతి కంతర్దృష్టిగలిగెడిశైలియేదనఁగా, అగ్రవర్ణమునుజన్మించిన బ్రాహ్మణశ్రేష్ఠులు స్వధర్మపాలనపూర్వకముగాఁజిత్తశుద్ధిని బొంది తర్వాత విషయవైరాగ్య సంపన్నతగలవారలై నివృత్తిమార్గగాములగుచు యోగసాధనపరాయణులగుటయే యైయున్నది. ఇట్లుచెప్పఁబడిన యోగిజనుల సమాధిలోనున్న బుద్ధిమూలముననే దార్శనికసిద్ధాంతము ప్రకటమై

నటో యది దప్పక భ్రాంతిరహితమే కాఁగలదు. అర్వాచీన జాతులలో నార్యజనోచితశైలి నామమాత్రముగూడ లేదు. వారియందుఁ గేవలము సాధారణబుద్ధిమూలమున ననుసంధాన ముజేసి వెలుపలనుండి లోపలకుఁ బోవుయత్నమగుచున్నది. మొత్తముమీఁద వారి దార్శనికములో భ్రాంతిరహితసిద్ధాంతము ప్రకటమగుట సంభవింపదని తేలినది.

అధ్యాత్మికోన్నతి కేడు క్రమములుగలవు. ఆయేడు క్రమములనే యనుసరించి వైదికదర్శనశాస్త్రములనుగూడఁ బూజ్యపాదులగు మహాత్ములు కేవలమేడుతరగతులలోనే విభాగించిరి. ఈయేడింటిలో విరోధప్రతీతికారణము శ్రీవేదవ్యాసులవారిచే నిట్లు చెప్పఁబడుచున్నది,

> "సప్తానాం జ్ఞానభూమీనాం । సాధకస్యాఖిలస్య చ
> భేదాద్విరోధ ఇత్యేవం । దర్శనేషు ప్రతీయతే"

ఏడుజ్ఞానభూములు, వానిసాధకులు, భిన్న భిన్నముగా నుండుటంబట్టి దర్శనశాస్త్రములలో విరోధము ప్రతీతి యగుచున్నది. వాస్తవములో విరోధమొంత మాత్రమును లేదు. ఆ విషయము ముందుఁ జెప్పఁబడును. ఈసప్తదర్శనములు త్రిభావములననుసరించి త్రిభాగములలో విభాగింపఁబడినవి. ఎట్లన, న్యాయదర్శనము, మఱియు వైశేషికదర్శనము పదార్థవాదసంబంధీయములు. అట్లే యోగదర్శనమును, సాంఖ్యదర్శనమును,

సాంఖ్యప్రవచన సంబంధీయములు. కర్మమీమాంసయు, భక్తి మీమాంసయు, బ్రహ్మమీమాంసయు నీమూఁడును, వేదముల కాండత్రయము ననుసరించి మీమాంసా సంబంధీయదర్శనములని యనఁబడుచున్నవి. ఈసప్తదర్శనముల కంటె నితరమగు దార్శనిక సిద్ధాంత మార్యగణ మంగీకరింపదు. వీనికంటె వేఱే దైన నొకదర్శనము గనుటగాని, వినుటగాని సంభవించినచో నది యంతర్భావరూపముగా నీసప్తదర్శనములలోఁజేరి యుండును. ఆత్యంతికదుఃఖనాశము, నిత్యానందప్రాప్తిని, గలిగించుటయే యీసప్తదర్శనముల ముఖ్యోద్దేశమైయున్నది. ప్రకృతి విలాసరూపమగు సంసారము దుఃఖమయమైనది. అందు సుఖమేదిగలదో యదిగూడ క్షణభంగురమై దుఃఖముయొక్క పూర్వరూపమాత్రమే యైయున్నది. దీనింబట్టి నిత్యానందమయుఁడును, నమృత పుత్త్రుఁడు నగు జీవుఁడు, నశ్వర సుఖమయమును, దుఃఖపూర్ణమునగు నిట్టి సంసారములో సుఖలాభము బొందనేరఁడు. కనుకనే జీవుఁడాత్యంతిక దుఃఖనాశము కోరుకుని, సుఖప్రాప్తికిని నిట్లట్లు భ్రమించుచున్నాఁడు, దర్శన శాస్త్రము జీవుని దుఃఖమయ సంసారమునుండి విముక్తుని జేసి యానందమయమగు బ్రహ్మధామములోఁ బ్రవేశింపఁజేయఁగలదు, దీనింబట్టి దీనికి దర్శనశాస్త్రమని పేరుగలిగినది. ఎల్ల దర్శన శాస్త్రములందును బ్రతిపాద్యవిషయము దుఃఖనాశము,

సుఖప్రాప్తియు నైనప్పటికిఁ బ్రథమజ్ఞాన భూమిదర్శనములతోఁ బ్రకృతిసంబంధ మెక్కువగా నైనందున దానిలోఁ బ్రధానముగా దుఃఖనాశమే లక్షీభూతము. మఱియు నంతిమజ్ఞానభూమిదర్శనములతోఁ బ్రకృతికంటెఁ బరము, నానందమయమునగు బ్రహ్మభావముయొక్క సంబంధము హెచ్చగుటంబట్టి దానిలో నిత్యానందమయ స్వరూపస్థితి, యతిశయముగా లక్షీభూతమై యున్నది. ఈసప్తదర్శనములలోని మూఁడువిభాగముల నీరీతిగాఁ గూడ బోధపరచుకొనవచ్చును. ఎట్లన, మొదటి రెండుదర్శనములు స్థూలవిజ్ఞాన మనఁగా ననుమానమునుండి దుఃఖనివృత్తిఁ జేయు భూమినిఁజూపును. రెండవ రెండుదర్శనములు, సూక్ష్మవిజ్ఞాన మనఁగా మధ్యభూమిలో నిలిచి దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి యను నీరెంటిరహస్యమును దెలుపును. మిగిలిన మూఁడుదర్శనములు, కారణవిజ్ఞానమయములైనవి. అనఁగా వానిలోఁగ్రమముగా నుత్తరోత్తర మత్యంత దుఃఖనివృత్తి జేయు నవస్థయొక్క స్వరూపము నిర్ణయమగుచుండును. ఇప్పుడీసప్తదర్శనముల సంక్షేపవృత్తాంతముఁజూపి యీవిషయముంగూర్చి విచారించుకొందము.

## —♦ న్యా య ద ర్శ న ము. ♦—

న్యాయదర్శనము గౌతమమహర్షులచే రచింపఁబడినది. దీనిని నాన్వీక్షికి యనియు, అక్షపాదదర్శనమనియుఁ జెప్పెదరు.

ప్రమాణములవలనఁ బదార్థనిరూపణము, లేక యితరులకు బోధించుటకై ప్రతిజ్ఞ, హేతువు,నుదాహరణము, నుపనయము, నిగమనము,ననునీ పంచావయవముల యవతరణమునకు న్యాయ మనిపేరు. న్యాయదర్శనమును బ్రధానముగా మూఁడు భాగ ములలో విభాగింపవచ్చును. ఎట్లన, తర్కము, న్యాయము, దర్శనము, నని. తర్కాంశములోఁ దర్కనిర్ణయము, వాదము, జల్పము, వితండము మున్నగు విషయములుండును. న్యాయాం శములోఁ బ్రమాణము మున్నగు విషయముల చర్చ చేయఁ బడును. మఱియు దర్శనాంశములో నాత్మానాత్మ విచారము గలదు. న్యాయదర్శన మైదధ్యాయములలో విభజింపఁబడినది. మఱియునొక్కొక్క యధ్యాయములో రెండేసి రెండేసియాహ్ని కములుగలవు. దీనివలన గౌతమమహర్షులవారు పదిదినము లలో న్యాయదర్శనమును రచించినట్లు తెలియుచున్నది. న్యాయ దర్శనములోఁ జెప్పఁబడు విషయము దుఃఖనివృత్తియై యున్నది. సంసారము దుఃఖమయము. ఇందేమైన సుఖమున్నచో నదిగూడ దుఃఖముతోఁగూడిన దగుటంబట్టి దుఃఖమేయగును. జన్మము గలుగుటయే దుఃఖకరము. అందువలన దుఃఖము నశింపవలయు నని యిచ్ఛయున్నయెడల జన్మమును నశింపఁజేయవలయును. జన్మమునకుఁగారణముప్రవృత్తి. ప్రవృత్తికిఁగారణమురాగద్వేష మోహాత్మకమగుదోషము. దోషముగూడ మిథ్యాజ్ఞానము

వలనఁబుట్టఁగలదు. అందువలన మిథ్యాజ్ఞానమును నష్టముజేయఁ దగినది. లేనిచో దుఃఖనివృత్తి గానేరదు. ఇందులకు గౌతమ మహర్షులవా రిట్లు సూత్రీకరించుచున్నారు.

" దుఃఖజన్మప్రవృత్తి దోషమిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనన్తరాపాయా దపవర్గః "

ఉల్లేఖింపఁబడినదుఃఖము, జన్మము, మున్నగువానికుత్తరోత్తరము నాశమయి తుదలో మిథ్యాజ్ఞానము సైతము నాశనమైనందువలన జీవునకు ముక్తిగలుగును. మిథ్యాజ్ఞానము నష్టమగుటకేమి యుపాయముగలదు? న్యాయదర్శనముయొక్క సమ్మతిలో మిథ్యాజ్ఞానము నశింపఁజేసెడి యుపాయము తత్త్వజ్ఞానమే యైయున్నది. అందువలనఁదత్త్వజ్ఞానలాభము వలననే యపవర్గ మనఁగా నాత్యంతికదుఃఖనాశనము గాఁగలదు.

తత్త్వజ్ఞాన మెట్లనికేఁగావలసినది ? దీనికి సమాధానము న్యాయదర్శనమందిట్లున్నది.

" ప్రమాణప్రమేయసంశయ ప్రయోజనదృష్టాంతసిద్ధాంతావయవ తర్కనిర్ణయవాదజల్ప వితండా హేత్వాభాసచ్ఛల జాతినిగ్రహ స్థానానాం తత్త్వజ్ఞానాన్నిశ్శ్రేయసాధిగమః"

నిశ్శ్రేయసపదవి లేక యాత్యంతికదుఃఖనివృత్తికొఱకు " ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండ,

హేత్వాభాస,చ్ఛల,జాతి,నిగ్రహస్థానము లనెడి యీపదునారుఁ పదార్థముల తత్త్వజ్ఞానము గావలసియున్నది. న్యాయదర్శనములో నీషోడశపదార్థముల లక్షణవిచారము దివ్యపద్ధతిగాఁ జేయఁబడినది. దీని సంక్షేపవర్ణన మీాదిగువ వ్రాయఁబడుచున్నది.

వీనిలో మొదటి పదార్థము ప్రమాణమైయున్నది. యథార్థజ్ఞానమునకు"ప్రమ" యనిపేరు.ప్రమ కే కారణ మనగా యథార్థజ్ఞానలాభము గలిగించు నుపాయము గలదో దానిని "ప్రమాణ" మని చెప్పెదరు. న్యాయదర్శన మతములోఁ బ్రమాణము నాల్గు తెఱంగులుగా నున్నది. (1) ప్రత్యక్షము, (2)అనుమానము (3) ఉపమానము (4) శబ్దము. ఇంద్రియములమూలమునఁ బొందఁబడిన జ్ఞానము ప్రత్యక్షము, అనుమానమును గూర్చి గౌతమమహర్షులవా రిట్లు చెప్పియున్నారు.

" అథ తత్పూర్వకం త్రివిధ మనుమానం పూర్వవ
త్శేషవ త్సామాన్యతో దృష్టంచ "

అనుపశ్చా త్తనఁగా లింగదర్శనమునకుఁ దరువాత నే ప్రమాణము లేక జ్ఞాన మనఁగా లింగలింగుల కుండెడి సంబంధజ్ఞానమున్నదో దానిని "అనుమాన" మనివచింతురు. అనుమానము ప్రత్యక్షపూర్వక మైనది. ఎందుల కందురా? లింగము ప్రత్యక్షముగానందువలన లింగలింగుల సంబంధము స్మరింపఁబడనేరదు.

ఎట్లన? పొయ్యిలో నున్న "అగ్ని (లింగి) పొగ (లింగము)- ఈరెండు నొకచోట నుండుట మొదటినుండి చూచినమీఁదనే యెప్పుడైనను గొండపైఁ బొగ గన్పడినచో నగ్ని యచ్చట నున్నట్లనుమానించుటకువీలుగల్గును. అనుమానము త్రివిధముగా నున్నది. (1) పూర్వవత్తు (2) శేషవత్తు (3) సామాన్యతో దృష్టము. మేఘమును జూచి వాననుగూర్చి యనుమానించుట "పూర్వవదనుమానము" ఇందుఁగారణముం గాంచి కార్య మనుమానింపఁబడినది. నదిలో జలసమృద్ధిని జూచి పర్వతముపై వాన పడిన ట్లనుమానించుట, శేషవదనుమానము. ఇందుఁ గార్యమును గని కారణ మూహింపఁబడినది. కారణముగాని కార్యముగాని లేకపోయి నప్పటికి సామాన్యముగా జూచి యేది యనుమానింపఁబడుచున్నదో యాయనుమానము "సామాన్యతో దృష్ట" మని వచింపఁబడును. ఎచట నొకదానితో రెండవదాని కుపమాన మీఁబడుచున్నదో యది యుపమానమని యనఁబడు చున్నది. న్యాయదర్శనమతములో సాదృశ్యజ్ఞాన సాధక ముపమాన మని యనఁబడును. ఎట్లన,

"ప్రసిద్ధ సధర్మాత్ సాధ్యసాధన ముపమానం"

పశువులో గోసాదృశ్యము, ముఖమునఁ జంద్రునిసాదృశ్యము, మున్నగువాని జ్ఞాన మెద్దానివలన లభించుచున్నదో దానిని

నుపమాన మని చెప్పెదరు. శబ్దలక్షణమునందు గౌతములవా రిట్లు వచించియున్నారు.

" ఆప్తోపదేశశ్శబ్దః "

భ్రమప్రమాదరహితమగు వాక్యమును "ఆప్తవాక్య" మనియనె దరు. ప్రమేయ మనఁగాఁ బ్రమాణ విషయము. ఇది పంద్రెండు రీతులుగా నున్నది. (1) ఆత్మ (2) శరీరము (3) ఇంద్రియము (4) అర్థము (5) బుద్ధి (6) మనస్సు (7) ప్రవృత్తి (8) దోషము (9) ప్రేత్యభావము (10)ఫలము (11)దుఃఖము (12) అపవర్గము లని. ఆత్మ ద్రిష్టయు భోక్తయు నైయున్నాఁడు. ఇచ్ఛయు, ద్వేషము, ప్రయోజనము, సుఖము దుఃఖము మున్నగునవి యాత్మలింగములైయున్నవి. ఆత్మకు భోగస్థానము శరీరము, మఱియు భోగసాధనము లింద్రియము లై యున్నవి.ఇంద్రియము లైదువిధములుగా నుండును. (1( ఘ్రాణము (2)రసనము (3) చక్షువు (4)త్వక్కు (5) శ్రోత్రము, లని. ఇంద్రియగణముభూత ములనుండి పుట్టుచుండును. భూతము లైదు రీతులుగానున్నవి. (1) పృథ్వి (2) అప్పు (3) తేజస్సు (4) వాయువు (5) ఆకాశ ము. ఘ్రాణేంద్రియము పృథివీసంబంధమైనది. రసనేంద్రియ ము జలసంబంధము . చక్షురింద్రియము తేజస్సంబంధము. త్వ గింద్రియము వాయుసంబంధము, శ్రోత్రేంద్రియ మాకాశసంబం ధమునై యున్నది. ఇంద్రియ విషయముల నామము లర్థములు.

ఘ్రాణేంద్రియమునకు విషయము గంధము, రసనేంద్రియమునకు విషయము రసము. చక్షురింద్రియమునకు విషయము రూపము. త్వగింద్రియమునకు విషయము స్పర్శము. శ్రోత్రేంద్రియమునకు విషయము శబ్దమునైయున్నది. స్మరణము, అనుమానము సంశయము, సుఖము లోనగు ప్రత్యక్షవిషయముల కింద్రియము మనస్సు. ప్రవృత్తి, మూడు ప్రకారములుగా నున్నది. (1) శారీరికము (2) వాచికము (3) మానసికము. దోషము త్రివిధములుగానున్నది. (1) రాగము (2) ద్వేషము (3) మోహము. కామము తృష్ణమున్నగునవి "రాగ"మనఁబడును. క్రోధము, ఈర్ష్యలోనగునవి "ద్వేష"మనఁబడును. మిథ్యాజ్ఞానము ప్రమాదముమొదలగునవి "మోహ" మనఁబడును. మాటిమాటికిజరుగుజన్మమరణములనామము 'ప్రేత్యభావము. దోషము వలనను బ్రవృత్తివలనను గల్గిన సుఖదుఃఖములయనుభవఫలము బాధన యనఁగా దాపలక్షణమగు దుఃఖమైయున్నది. నిశ్చయజ్ఞానములేని దానిపేరు సంశయము. సాధారణధర్మజ్ఞానము, అసాధారణధర్మజ్ఞానము, విప్రతిపత్తి, ఉపలబ్ధి, అనుపలబ్ధియను నీయైదు సంశయకారణములయియున్నవి, దేనిని లక్ష్యమందుంచి కొని ప్రవృత్తియగుచుండునో దానిపేరు ప్రయోజనము. ఏవిషయములో సాధారణుల (లౌకికుల) యు, మేధావుల (ప రీ క్ష కు ల) యు, మతభేదములేదో దానిపేరు, దృష్టాంతము.

అర్థముయొక్క యభ్యుపగమము లేక నిశ్చయ మేదియున్నదో దానిని "సిద్ధాంత"మని యనెదరు.ఏశబ్దములను లేక వాక్యముల ననుసరించి సాధింపఁదగినయర్థమనఁగాసాధ్యసిద్ధియగు చున్నదో దానిని న్యాయమని వచింతురు. న్యాయముయొక్క యేక దేశ మవయవము. అవయవ మైదువిధములుగానున్నది. ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము. ఈన్యాయాంశములోఁదొలుత నొక ప్రస్తావమో లేక యొకప్రతి జ్ఞయో చేయఁబడును.తరువాత దానికి హేతువు నిర్దిష్టమగును. అటుపిమ్మట నుదాహరణమూలమున హేతువున కున్న కారణము దృఢీకరింపఁబడును. ఇట్లు హేతునిర్దిష్టమైనమీఁదఁ గార్య స్థలమందు దాని కుపనయ మనఁగాఁబ్రయోగము జరుగును.చివ రకు దానిమూలమున నిగమన మనఁగా సిద్ధాంతమగుచున్నది. ఏవిషయములోని సత్యమెఱుఁగఁబడదో యావిషయమందలి తథ్యజ్ఞానముకొఱకు, గారణోపపత్తిననుసరించి యొకపక్షము యొక్క సంభావనయగుచున్నదో దానిని దర్కమని వ్యాకరిం తురు. ఏవిషయముయొక్కయైన తత్వమెఱుఁగఁబడక పోవుట వలన దానిని గుర్తెఱుంగవలయునను కోర్కెసహజముగాఁ గల్గు చుండును. ఎఱుఁగవలయునను నిచ్ఛజనించుటవలననే పరస్పర విరుద్ధములుగా నుండువాక్యముల చర్చ జరుగును. ఇట్లు సంశ యింపఁబడెడి రెండుధర్మములలో నే ధర్మమునకుఁగారణోపపత్తి

గల్గుచున్నదో దానికొఱకు "ఇదియిట్లు కాఁదగినది." అనెడి యిట్టి సంభావనగూడ నగుచుండును. ఇట్టిసంభావననే తర్కమనివచింతురు. ప్రమాణమునకును. దర్కమునకు నే ఫలము గలదోదానికి నిర్ణయ మనినామము.అనఁగా, స్వపక్షస్థాపనమూలముగా లక్షీభూతార్థమేదో దానికి "నిర్ణయ"మనిపేరు. తత్వనిర్ణయోద్దేశమువలన నే కథ నడుపఁబడుచున్నదో దానిని "వాద" మనియందురు. అనఁగాఁదనజయముపైఁగాని ప్రతిపక్షిపరాజయముపైఁగాని యొంతమాత్రము లక్ష్యముంచక కేవలము తత్వనిర్ణయము జేయుటయందే యే కథోపకథనము నడుచునో యదియే "వాదము."తత్వనిర్ణయమునుగూర్చి లక్ష్యపెట్టక ప్రతివక్షిపరాజయమును, స్వపక్షజయమును గోరి యేశాస్త్రార్థము జరుగునో దానికి "జల్ప"మని నామము.జల్పములో వాదిప్రతివాదు లిరువురును స్వపక్షస్థాపనమును బరపక్షప్రతిషేధమును లక్ష్యమునందుంచుకొందురు, స్వపక్షమని యేదియు నుంచికొనక కేవలము పరపక్షము ఖండించుటకొఱ కే శాస్త్రార్థమగునో యది "వితండ"వాద మని చెప్పఁబడును. దుష్టమగుహేతువుయొక్క పేరు హేత్వాభాసము.అనఁగా నేదిహేతువురీతిఁబ్రతీతియయ్యు వాస్తవములో హేతువు గానేరదో దానిని హేత్వాభాస మని యనెదరు.ఏయర్థముకొఱకు వాక్యప్రయోగము చేయఁబడునో దానికి విపరీతమగు నర్థమును గల్పించి దోషోద్భావనచేయుటకుఁ బేరు

"ఛలము." ఎట్లనఁగా, "నవకంబలోఽయం మనుష్యః" ఈవాక్య ములో వక్తయభిప్రాయమేమనఁగా, ఈమనుష్యుఁడు క్రొత్త గొంగడి గలవాఁడని యున్నది. కాని ఛలవాది యగువాఁడు ఈ మనుష్యునిదగ్గిర తొమ్మిదిగొంగళ్లున్నవని చెప్పును. వ్యాప్తి నపేక్షింపక కేవలము సాధర్మ్యవైధర్మ్యములబలమున నే దోష మీయఁబడుచున్నదో దానికి "జాతి"యనిపేరు. దీని కిరువది నాలుగు భేదములుగలవు. ఇవి మూలదర్శనములోఁజూడఁదగినవి, దేనిమూలమున విచారకార్యమునకువిపరీతజ్ఞానము లేక ప్రకృత విషయములోని యజ్ఞానము ప్రకటమగుచున్నదో దానికి నిగ్రహస్థాన మనిపేరు. తొలుత నొకవిధముగాఁ బ్రతిజ్ఞ గావించి తరువాత దానిని విడిచిపెట్టుట, రెండవపక్షమునందు దోషము లున్నప్పటికిని దోషోద్భావన సేయకుండుట, ఎదిరిచేఁ దనపైఁజూపఁ బడినదోషములను ఖండింపకుండుట, మున్నగునవి నిగ్రహస్థాన మునకు లక్షణములై యున్నవి. గౌతమమహర్షులవారి సమ్మతిలో నీషోడశపదార్థములతత్త్వజ్ఞానముచే ముక్తి గలుగుననియున్నది.

శరీరముతో నాత్మకు సంయోగమున్నందువలన "అహ" మ్మను జ్ఞాన ముదయమయి యాత్మకు దుఃఖ మగుచున్నది. ఇందులకై శరీరమునుండి యాత్మను వేఱుచేయుటయే యీదర్శ నము ననుసరించిన ముక్తియై యున్నది. న్యాయ దర్శనములో నీశ్వరునకుఁ బ్రాధాన్యము, మఱియు ముక్తికి హేతువు

లేకపోయినను దీనియం దీశ్వరున కస్తిత్వము స్వీకరింపఁబడినది. వెండియు ననేకప్రకారము గు తర్కవాదనులమూలమున వేదములకుఁగూడఁ బ్రామాణ్యము గ్రహిం పఁబడినది. ఈ సర్వవిషయములంగూర్చి ముందు జర్పింపఁబడును.

## —♦ వై శే షి క ద ర్శ న ము. ♦—

న్యాయమును, వైశేషికమునునొకతరగతిలోఁజేరినదర్శనములు. ఈదర్శనమును బ్రవర్తింపఁ జేసినవారు కాణాదమహర్షులవారు. దీనిలో "విశేష" మను పేరుగల యొకపదార్థమును హెచ్చుగాస్వీకరించుటంబట్టిదీనినామధేయము "వైశేషిక" దర్శనమైనది. వైశేషిక దర్శనమందు (320) మూడువందలయిరువదిసూత్రములు గలవు. ఇవి పదియధ్యాయములలో విభాగింపఁబడినవి. ఒక్కొక్క యధ్యాయములో రెండేసిరెండేసి యాహ్నికములు గలవు. దీని వలన నిరువదిదినములలో నీదర్శనశాస్త్రము రచింపఁబడినదని తెలియుచున్నది. ప్రథమాధ్యాయములోఁ బ్రథమాహ్నికము నందు "జాతిమ" త్తనఁగా ద్రవ్యగుణకర్మములయొక్కయు ద్వితీయాహ్నికమునందు సామాన్యము లేక జాతి మఱియు విశేష పదార్థముయొక్కయు నిరూపణము జేయఁబడినది. ద్వితీయాధ్యాయములోఁ బ్రథమాహ్నికమందు భూతపదార్థము యొక్కయు ద్వితీయాహ్నికమందుఁ గాలముయొక్కయు దిక్కుయొ

క్కయుఁ దృతీయాధ్యాయములోని రెండాహ్నికములలో నాత్మ
యొక్కయు నిరూపణముగావింపఁబడినది. విశేష మేమన, ఈయ
ధ్యాయములోనిద్వితీయాహ్నికమునందు మనస్సుయొక్క నిరూప
ణము చేయఁబడినది. నాల్గవయధ్యాయములోఁ బ్రథమాహ్ని
కమునందు జగత్తుయొక్క మూలకారణముగూర్చియు,మఱియుఁ
గొన్ని ప్రత్యక్షకారణములఁగూర్చియు ద్వితీయాహ్నికములో
శరీరమునుగుఱించియు విచారింపఁబడినది. పంచమాధ్యాయము
లోఁ బ్రథమాహ్నికమందు శారీరకకర్మములంగూర్చియు ద్వితీ
యాహ్నికమునందు మానసికకర్మములంగుఱించియు,నిట్లె షష్ఠా
ధ్యాయములోః బ్రథమాహ్నికమందు దానప్రతిగ్రహములం
గూర్చియు, ద్వితీయాహ్నికమం దాశ్రమధర్మములంగుఱించియు
నట్లే సప్తమాధ్యాయములోని రెండాహ్నికములందును రూప
గుణసామాన్యములంగూర్చియుఁ జర్చింపఁబడినది. అష్టమాధ్యా
యములోఁ బ్రథమాహ్నికమునందుఁ బ్రత్యక్షజ్ఞానముగూర్చియు
ద్వితీయాహ్నికమునందు జ్ఞానసాపేక్షజ్ఞానముగూర్చియు, జ్ఞాన
సాధనములగు నింద్రియములంగుఱించియు నీప్రకారముగా నవ
మాధ్యాయములోఁ బ్రథమాహ్నికమం దభావమునుగూర్చియు
గొన్ని ప్రత్యక్ష కారణంబులంగుఱించియు, ద్వితీయాహ్నికము
నం దనుమానస్మృత్యాదులగూర్చియు నట్లే దశమాధ్యాయ
ములోఁ బ్రథమాహ్నికమునందు సుఖదుఃఖములంగూర్చియు,
ద్వితీయాహ్నికమునందు సమవాయప్రభృతికారణములంగుఱిం

మనఁగా సాధారణధర్మము. ఎట్లన, పృధివి, జలము, మున్నగు ద్రవ్యములసాధారణ ధర్మము ద్రవ్యత్వమై యున్నది. ద్రవ్యవై ధర్మ్యము గుణత్వమై యున్నది. ఎందులకనఁగా, ద్రవ్యమందలి గుణత్వము దృష్టము గానేరదు. ద్రవ్యము తొమ్మిదివిధములుగా నున్నది 1 పృథివి 2 అప్పు 3 తేజస్సు 4 వాయువు 5 ఆకాశము 6 కాలము 7 దిక్కు 8 ఆత్మ 9 మనస్సు లని. పృథివ్యప్తేజోవాయువులను నీ నాలుగుభూతములు నిత్యములు, అనిత్యములు, అనుభేదముచే రెండువిధము లైనవి. పరమాణురూపములో నిత్యమును, బరమాణుసంఘాతముచే జనితములగు శరీరేంద్రియవిషయరూపములలో ననిత్యములై యున్నవి. వైశేషిక మతములోఁ బృథివిమున్నగు నాల్గురీతులుగానుండు ద్రవ్యముల పరమాణువులును, నాకాశముమొదలగుపంచద్రవ్యములును నిత్యము లగును. ఆత్మ, జ్ఞానమున కాశ్రయము. ఆత్మ మానసప్రత్యక్షమునకు విషయము. ఆత్మ, యొక్కొక్కశరీరములో భిన్నభిన్నముగా నుండును. వైశేషికమతమునందు మనస్సణుపరిమాణమును, మఱియు నాత్మయొక్కయు, సుఖదుఃఖాదులయొక్కయుఁబ్రత్యక్షమునకుఁ గారణము నై యున్నది. ద్రవ్యము గుణమున కాశ్రయము. గుణములేనిద్రవ్య ముండనేయుండదు. ఆకాశ మే ద్రవ్యమునకుఁగూడ నారంభకముగాదనియే వైశేషికమతమై యున్నది, ఆకసము, విభువును, శబ్దమున

కాశ్రయము నై యున్నది. జగత్తులోని యే పదార్థముగూడ నాకాశసంబంధము లేకుండ లేదు. ఏపదార్థములో గుణత్వజాతి గలదో దానిని గుణ మని యనెదరు. గుణ మిరువదినాలుగు ప్రకారములుగా నున్నది.రూపము,రసము, గంధము, స్పర్శము శబ్దము, సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, బుద్ధి,సుఖము, దుఃఖము, ఇచ్ఛ,ద్వేషము, యత్నము,గురుత్వము, ద్రవత్వము, స్నేహము, సంస్కారము.ధర్మము,మఱియు నధర్మము ననునవి.పరిమాణము నాలుగుప్రకారములుగా నున్నది. అణువు, మహత్తు,హ్రస్వము దీర్ఘము. గుణముల ప్రత్యేకప్రత్యేకలక్షణము మూలగ్రంథ మందుఁ జూడఁదగినది.

కర్మమైదువిధములుగా నున్నది, ఉత్క్షేపణ మనఁగా నూర్ధ్వక్షేపణము అపక్షేపణమనఁగా నిమ్నక్షేపణము, ఆకుంచనము. ప్రసారణము, మఱియు గమనము సామాన్య మనఁగా జాతి యని యర్థము. జాతి రెండువిధములు. పరా. అపరా. అధికదేశవృత్తి జాతిపర యనియు నల్ప దేశవృత్తి జాత్యపర యనియుఁ జెప్పఁబడును. ఎట్లనఁగా మనుష్యత్వము అశ్వత్వము దోత్వము మొదలగునవి యపరా జాతియుఁ బ్రాణిత్వము పరాజాతియు నగును. విశేష మనఁగా వ్యక్తి యని కొందఱు వచింతురు. సారాంశ మేమనఁగా,

సామాన్యమన జాతియనియు, విశేషమనఁగా వ్యక్తియనియు దాత్పర్యము. కాని యందఱకు నిది సమ్మతమై యుండలేదు. వారి యాశయములో నే యసాధారణధర్మమూలమున నిరవయవ మగు పదార్థములకుఁ బరస్పరము భేదసిద్ధియగుచున్నదో దాని పేరు విశేష మనియున్నది. వైశేషికమతావలంబకులగు జనులు వచించున దేమనఁగా? ద్వ్యణుకము మొదలుకొని ఘటాదులవఱకునుండు సమస్తసావయవద్రవ్యములకు ఁబరస్పరభేదము తమతమ యవయవభేదముచే సిద్ధియగుచున్నది. కాని యేధర్మము యొక్క మూలమున నిరవయవమగు నొకజాతిలోని రెండుపరమాణువులలోఁ బారస్పరిక భేదము సిద్ధియగుచున్నదో దానికే విశేష మనినామము. ఈ విశేష పదార్థము యొక్క విశ్లేషణరూపహేతువువలననే దీనికి "వైశేషికదర్శన మని నామధేయము గలిగినది. సమవాయ మనఁగా, నిత్యసంబంధముగలది. తంతువుతో వస్త్రమునకు, గుణముతో గుణికిని గుండతో మట్టికిని, లేక జాతితో వ్యక్తికిని నే యెడఁదెగనిసంబంధ మున్నదో దానినే సమవాయసంబంధ మని యనెదరు. అభావమునకు రెండుభేదములు గలవు 1 సంసర్గాభావము 2 అన్యోన్యాభావము. సంసర్గాభావ మనఁగా, సంబంధాభావము మూఁడురీతులుగా నున్నది. 1 ప్రాగభావము 2 ప్రధ్వంసాభావము 3 అత్యంతాభావము. సూత్రమునందు వస్త్రమునకుఁ

ప్రాగభావముగలదు. ఘటముచూర్ణమయినతరువాతను దేహము భస్మమయిన యనంతరమందును ప్రధ్వంసాభావమును, జడమునందుఁ జేతనమున కత్యంతాభావమును గలదు. అన్యోన్యాభావ మెట్లనఁగా, అశ్వము గజముగాదు. దీనింబట్టి యశ్వములోహస్తికే యభావ మున్నదో లేక హస్తిలో నశ్వమున కే యభావమున్నదో దానిని "అన్యోన్యాభావ"మని యనెదరు. పైనఁజెప్పఁబడిన షట్పదార్థములు భావప్రధానములై యున్నవనియు, భావముయొక్క యభావమే యభావపదార్థము ననియుఁ గాణాదమహర్షి సమ్మతియై యున్నది.

వైశేషికదర్శనము ననుసరించి యీ షట్పదార్థముల తత్త్వజ్ఞానమువలన ముక్తిగల్గును. ఇందుఁ బ్రధానముగా సప్తపదార్థము లనఁగా నాఱుభావపదార్థములయొక్కయు నొకయభావపదార్థముయొక్కయు సంజ్ఞ నిర్దేశించి దీనితరువాత నా యా విభాగములలో నంతర్గతములైన విభాగములకుఁ గూడ సంజ్ఞ నిర్దేశింపఁబడినది. ఈకారణమునుబట్టి వైశేషికదర్శనమును "సప్తపదార్థవాది" యనికూడ వచింతురు. దీనిలో క్షితియన నేమి? జలమన నేమి? తేజస్సన నేమి? ఉత్క్షేపణము, ఆకుంచనములోనగునవి యనగా నేమి? వీనికన్నిటికి సూత్రరూపముగా వ్యాఖ్యాన మొనర్పఁబడినది. పృథివిమున్నగువాని లక్షణముంగూర్చి మహర్షి యిట్లు చెప్పుచున్నాఁడు.

" రూప రస గంధ స్పర్శవతీ పృథివీ"

" రూపరసస్పర్శవత్య ఆపో ద్రవా స్నిగ్ధాః"

" తేజో రూపస్పర్శవత్"

" స్పర్శవాన్ వాయుః"

" తఆకాశేనవిద్యంతే"

దేనిలో రూపము, రసము, గంధము, స్పర్శము లున్నవో యది పృథివి. ఏది రూపరసస్పర్శములతోఁ గూడి ద్రవమును స్నిగ్ధమునై యున్నదో యది జలము. దేనిలో రూపమును, స్పర్శము నున్నదో యది తేజస్సు, దేనియందు స్పర్శముగలదో యది వాయువు. దేనిలో రూప, రస, గంధ, స్పర్శము లెంతమాత్రమును లేవో యది యాకాశము. ఇట్లొక్కొక్క పదార్థమునకు సంజ్ఞ నిర్దేశింపఁబడికారణపరంపరయొక్క యనుసంధాన మొనర్చుచుఁ గాణాదమహర్షులవారీసిద్ధాంతమును గావించియున్నారు.

" సదకారణవన్నిత్యం"

సత్పదార్థములలో, దేనికిఁ గారణము లేదో యది నిత్యము. ఈ న్యాయమునుబట్టి పరమాణువే సత్తును, నిత్యము నగు పదార్థమునైయున్నది. దీని కే కారణము గూడలేదు. పరమాణువాద తత్త్వము కాణాదమహర్షులవారి మూలముననే ప్రచారములోనికి వచ్చినది. అతని సమ్మతిలో నీసంసారము పరమాణువుల సంయోగములవలనఁ బుట్టినదై యున్నది. ఈసంయోగ మేదో యొక యవ్యక్తకారణమువలన నగుచున్నది. పూజ్యపాదులగు మహర్షులు దీనికి భగవదిచ్ఛయే యని చెప్పిరి. పృథివియందలిసకల

పదార్థములు పరమాణువుల సమష్టి మాత్రమైయున్నవి. విభా
గమును జేయఁగాఁ జేయఁగా సర్వపదార్థములు నొకసూక్ష్మతను
దశనుబొందుచున్నవి ఏదశలో వానిని దిరిగి విభాగించుటకు వీలు
గానేరదో యట్టి యవిభాజ్యమును, సూక్ష్మతమము నగు పదా
ర్థమే నిత్యపరమాణువు. వైశేషికదర్శనములో నీశ్వరున కస్తి
త్వము స్వీకరింపఁబడినది. అయితే జీవునిముక్తితో నీశ్వరుని
సంబంధవిశేషము జూపఁబడలేదు. వారియభిప్రాయములోఁబదా
ర్థములతత్త్వజ్ఞానముమూలమున నదృష్టనాశము గాఁగలదు.
దీనివలన జనులకు ముక్తి లభించును, ఈవిషయములన్నియు
ముందు విచారింపఁబడును. వైశేషికమతమునందుఁ బ్రమాణము
రెండువిధములుగా నున్నది, 1 ప్రత్యక్షము 2 అనుమానము.
శబ్దప్రమాణ మనుమానప్రమాణములోనే యంతర్గతమై
యున్నది. ఏదివ్యమైనఁదీసికొనివచ్చుటకై చెప్పుటవలన శబ్దము
వినియే యా ద్రవ్యవిషయములో ననుమానము గలుగుచు
న్నది. అందువలన శబ్దముగూడ ననుమానాంతర్గతమే. ప్రత్యక్ష
మగు ధూమమును గాంచి యప్రత్యక్షమగు వహ్నిని ననుమా
నించినట్లు ప్రత్యక్షశబ్దముచే నప్రత్యక్షపదార్థముయొక్క యను
మానము గల్గుచున్నది. లింగదర్శనమువలననో లేక శబ్దప్రమా
ణమువలననో యప్రత్యక్షమగు పదార్థముయొక్క జ్ఞానము

మాత్రమే యనుమితి. అందువలన నైయాయికసమ్మతమైన యుపమానప్రమాణముగూడ వైశేషికమతమునం దనుమానప్రమాణములో నంతర్గత మైనది. ఇట్లు పదార్థములతత్త్వజ్ఞానము యొక్క మూలమున జీవునకు నిశ్శ్రేయసలాభముగల్గును.

—(యో గ ద ర్శ న ము.)—

యోగదర్శనమును రచించినవారు శ్రీపతంజలిభగవంతులవారు. దీనిలో ౧౯౫ సూత్రములున్నవి. వీనిపై శ్రీవేదవ్యాస భగవానులవారు భాష్యమును గావించియున్నారు, యోగ దర్శనమునకు నాలుగుపాదములు గలవు. సమాధిపాదము సాధనపాదము. విభూతిపాదము. కైవల్యపాదము. ప్రథమపాదములో యోగముయొక్క యుద్దేశము, లక్షణమును, వృత్తి లక్షణమును, యోగోపాయమును, ఫలమును ప్రకారభేదమును వర్ణింపబడినవి. రెండవపాదమునందుఁ గ్రియాయోగము, క్లేశకర్మ విపాకములు, తద్దుఃఖము, హేయము, హేయహేతువు, హానము, హానోపాయరూపియగు వ్యూహచతుష్టయ వర్ణనమును గావింపఁబడినవి. మూఁడవపాదములో యోగాంతరంగపరిణామము, సంయమమూలమునఁ గలుగు విభూతివివేకమువలనఁ బుట్టెడి జ్ఞానమును బ్రతిపాదింపఁబడినవి. నాల్గవపాదములో ముక్తికియుక్తమగుచిత్తము, పరలోకసిద్ధి, బాహ్యార్థసద్భావసిద్ధి చిత్తాతిరిక్తమగునాత్మసిద్ధి,ధర్మమేఘసమాధి,జీవన్ముక్తి,మఱియు

వి దేహాకైవల్యమును వర్ణింపఁబడినవి. పతంజలిదర్శనమునకు "సాంఖ్యప్రవచన" మని మఱియొకపేరు గలదు. ఇందులకుఁ గారణ మేమనఁగా, శ్రీపతంజలిభగవానులవారు సాంఖ్యదర్శనమునకుఁ బ్రవర్తకులయిన కపిలమహర్షులవారి దార్శనికసిద్ధాంతములను గ్రహించియున్నారు. సాంఖ్యమునందుఁ జెప్పఁబడిన పంచవింశతితత్త్వము లనఁగా "పురుష ప్రకృతి, మహత్తత్త్వ, అహంకార, పంచతన్మాత్ర, ఏకాదశేంద్రియ, పంచమహాభూతము లీదర్శనములో స్వీకరింపఁబడినవి. అయితే పతంజలులవారితత్త్వములుగాక యింకొకతత్త్వమును బ్రచారము గావించిరి. ఈ తత్త్వ మీశ్వరుఁడై యున్నది. ఈశ్వరుఁడు సాంఖ్యోక్త పురుషుఁడు గాఁడు. పురుషవిశేషుఁడు. పాతంజలసూత్ర మిట్లున్నది.

"క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః"
తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజం
స ఏష పూర్వేషా మపి గురుః కాలే నానవచ్ఛేదాత్.

ఏ విశేషపురుషుఁడు క్లేశమువలనను, గర్మములవలనను, గర్మఫలమువలనను, మఱియు సంస్కారసంబంధమువలనను, రహితుఁడగుచున్నాఁడో వాఁడే యీశ్వరుఁడు. దానిలోఁ బరమజ్ఞానబీజ మున్నది, కాలమూలమున నవచ్ఛిన్నుఁడు గాకపోవుటచే నితఁడు బ్రహ్మాదులకుఁగూడ గురుఁడు! ఇతరేతరపురుషు లనఁగా సాంఖ్యముచేఁ జెప్పఁబడిన యనేకపురుషు లీదర్శనములో

వచింపఁబడిన యీశ్వరునివలెఁ గారు. ఆపురుషులయందుఁ గ్లేశ ము, గర్మము, గర్మఫలముచు, మఱియు సంస్కారసంబంధము లున్నవి. క్లేశాదులు భోగహేతువులు. ఈశ్వరునియందుఁ గ్లేశా దులు లేనందున వానికి భోగమే లేదు. క్లేశాదు లంతఃకరణ ధర్మములైనప్పటికిని సాన్నిధ్యవశముచేఁ బురుషునియందుఁగూడ నుపచరించుచున్నవి. పురుషుఁడు వానిభోక్త. భగవద్గీతలో నిట్లు వచింపఁబడినది!

" పురుషః ప్రకృతిస్థోహి, భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్"

పురుషుఁడు ప్రకృతితోఁగూడికొని ప్రకృతివిషయములను భోగిం చుచున్నాఁడు. యుద్ధమునందు జయమో పరాజయమో రాజు నకే యారోపింపఁబడినట్లు బుద్ధియందున్నభోగాదులు పురుషు నియం దుపచరితము లగుచున్నవి.

క్లేశ మైదువిధములుగా నున్నది, 1 అవిద్య 2 అస్మిత 3 రాగ 4 ద్వేష 5 అభినివేశము లని. మిధ్యాజ్ఞానము నవిద్య యని యనెదరు. యోగదర్శనమం దిట్లున్నది

" అనిత్యాఽశుచిదుఃఖాఽనాత్మసు నిత్యశుచిసుఖాఽఽత్మఖ్యాతిరవిద్యా"

అనిత్యవస్తువునందు నిత్యత్వజ్ఞానము, నశుచిశరీరాదికమునందు శుచిత్వజ్ఞానము. దుఃఖమునందు సుఖజ్ఞానము, నవాత్మలగు దేహాదులయం దాత్మజ్ఞాన మవిద్య యగును. సంసారమందలి సమస్తసుఖములు దుఃఖమిశ్రములై యున్నవి. కాఁబట్టి యజ్ఞా

నులగు జనులు పరిణామ, తాప, సంస్కార. దుఃఖమిశ్రితమగు సాంసారికసుఖములో మగ్నులైనను వివేకులగుజనులు మాత్ర మద్దానిని దుఃఖమనియే తలంచెదరు. బుద్ధియుఁబురుషుఁడును వాస్తవములోఁ బరస్పరము భిన్నమైనప్పటికి రెంటియొక్క యేకరూపజ్ఞానమునకు "అస్మిత"యని పేరు. రాగద్వేషవిషయ ముఁగూర్చి యోగదర్శనమం దిట్లు వ్రాయఁబడినది.

" సుఖానుశాయీ రాగః, దుఃఖానుశాయీ ద్వేషః"

సుఖవిషయమందలియభిలాషకు రాగ మనియు దుఃఖసాధనములో జిత్తమందలివైరాగ్యమునకు ద్వేష మనియుఁ బేళ్లు. అభినివేశ మనఁగా, ప్రాకృతసంస్కారకారణముచేఁ బాడితపామరులకందఱకుఁ గూడఁగలిగెడిమృత్యుభయము. ఇదియే పంచవిధములుగా నుండు క్లేశము. దీనిమూలమున సంసారములో జీవునకు దుఃఖము గలుగుచున్నది. యోగదర్శన మిట్టిదుఃఖము నుండి తొలఁగించి పురుషునిస్వరూపములోఁ బ్రతిష్ఠితునిగాఁ జేయుచున్నది. పాతంజలదర్శనమతమునందు ౨౫ తత్త్వములు లేవు. ఇరువదియాఱుతత్త్వములు గలవు. కాని యీతత్త్వవిచారణము యోగదర్శనమునకు ముఖ్యవిషయము గాదు. యోగమే యీదర్శనమునకు ముఖ్యవిషయమై యున్నది. యోగముయొక్కస్వరూపము, సాధనము, గౌణఫలము, విభూతి, మఱియు ముఖ్యఫలమగుకైవల్యముయొక్క తత్త్వనిర్ణయ

మును, దీనిలోఁ బ్రతిపాదించువిషయములై యున్నవి. యోగ
శాస్త్రము, చికిత్సాశాస్త్రమువలె నాలుగుపర్వములందు విభా
గింపఁబడినది. చికిత్సాశాస్త్రము రోగము నిదానము ఆరోగ్యము
మఱియు నౌషధము ననెడి యీనాలుగధ్యాయములో
విభక్తమైనట్లు యోగశాస్త్రముగూడ హేయము, హేయ
హేతువు, హానము, వెండియు హానోపాయము లనెడి యీనా
లుగుపర్వములలో విభక్తమైనది. అన్యాన్యదర్శనములమాఁడ్కిని
పాతంజలదర్శనమతమందుఁగూడ సంసారము దుఃఖమయమనియు
నందుచే హేయమైనదనియు నున్నది. సూత్రమం దిట్లు
చెప్పఁబడినది.

“దుఃఖమేవ సర్వం వివేకినః”

వివేకముగలవారలకు సంసారమంతయు దుఃఖమయ మైనది.
హేయరూపియగుసంసారములోని హేతువుయొక్కయు, హానము
యొక్కయు, హానోపాయముయొక్కయు లక్షణము సూత్ర
ములం దీక్రిందిరీతిగా వర్ణింపఁబడినది.

“ ద్రష్టృదృశ్యయో స్సంయోగో హేయహేతుః”
“ తదభావా త్సంయోగాభావో హానం, తద్దృశేః కైవల్యం”
“ వివేకఖ్యాతి రవిప్లవా హానోపాయః,”

ఈహేయసంసారముయొక్క నిదాన మనఁగా హేతువు, ప్రకృతి
పురుషులసంయోగమై యున్నది. కాని ప్రకృతిపురుషుల
సంయోగముచేఁబుట్టెడి యిట్టిసంసారమున కుచ్ఛేదముగలుగుట

సంభవించును. దీనినే హాన మనిచెప్పెదరు. ఈహానమున కుపాయము ప్రకృతిపురుషులయథార్థమైన భేదజ్ఞానమై యున్నది. ఇట్లు ప్రకృతిపురుషులభేదజ్ఞానము మిక్కిలి చక్కఁగాఁగల్గినప్పుడు మోక్షము గలుగఁగలదు. సాంఖ్యదర్శనమతములోఁ బంచవింశతితత్త్వములజ్ఞానము గలుగును. అయితే యోగదర్శనమతమందు యోగమూలముననే యిటువంటివివేకము సంభవింపఁగలదు. యోగలక్షణ మిట్లున్నది.

" యోగ శ్చిత్తవృత్తినిరోధః "

చిత్తవృత్తిని నిరోధించెడిపనికి యోగ మనిపేరు, చిత్తమున కైదవస్థ లనఁగా భూములు గలవు, 1 మూఢ, 2 క్షిప్త 3 విక్షిప్త 4 ఏకాగ్ర (5) నిరుద్ధము లని వానినామధేయములు, వీనిలో మొదటిమూఁడవస్థలు యోగావస్థకుఁగ్రిందిదైన వ్యుత్థానదశలోఁ గలుగును. తమోగుణాధిక్యముచేఁ బ్రమాదమూలముననో, లేక,మోహమూలముననోయాచ్ఛన్నమగు నవస్థయేమూఢము, రజోగుణాధిక్యముచేఁ గలిగెడి చంచలావస్థ క్షిప్తము. మఱియు నొక్కొక్కప్పుడు సత్త్వగుణ ముదయించుటవలన చిత్తమున కేవృత్తియులేని నిశ్చలావస్థ గలుగుచున్నదో దానికి విక్షిప్త మనిపేరు. ఈయవస్థ క్షణిక మగుచున్నది. ఈమూఁడింటికి వేఱయిన యేకాగ్రదశలోయోగమూలమునఁ జిత్తవృత్తినిరోధ మగుట ప్రారంభింపఁగలదు. ఈయేకాగ్రవృత్తివలనఁ

బిమ్మట నిరుద్ధవృత్తి జనింపఁగలదు. ఇవియే యైదువృత్తులు. వెండియు నీవృత్తులలోనే యోగప్రాప్తి యగుచున్నది. చిత్తములోని పంచావయవవృత్తి క్లిష్టము, అక్లిష్టము, అనుభేదముచే రెండువిధముల విభజింపఁబడినది. సాధారణముగా రాజస, తామస, వృత్తులుక్లిష్టములును, సాత్త్వికవృత్తి యక్లిష్టమునై యున్నది. ఇట్లు రెండు తెఱంగులుగా నున్నవృత్తి పంచావయవములుగలదైనది. ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్రస్మృతులని వానినామములు. ప్రమాణము మూఁడురీతులుగానున్నది. ప్రత్యక్షము, అనుమానము, ఆగమములని. విపర్యయ మనగాఁ మిథ్యాజ్ఞానము. ఎట్లనఁగా శుక్తి (ముత్తెపుచిప్ప) యందు రజత (వెండి) జ్ఞానము గలుగుట. వస్తువు లేకపోయినప్పటికిఁగూడ శబ్ద జ్ఞానకారణ మనెడి యేవృత్తియున్నదో దానిని వికల్ప మని యనెదరు, ఎట్లన, గగనకుసుమము. శశశృంగము. సుషుప్తికాలములోనిచిత్తవృత్తికి నిద్ర యనిపేరు. నిద్దురలేచినపిమ్మట నిద్రాకాలములోని సుఖము జ్ఞాపకమునం దున్నది. ఇందువలన నిద్రను గూడ వృత్తిగాఁ జెప్పియుండిరి. చిత్తమునం దుండినవిషయములను దరువాత స్మరించుట స్మృతి యనఁబడును. ఈయైదింటికంటె వేఱయినవృత్తి యింకొకటిలేదు. చిత్తముతోఁగూడఁ బురుషునకు సంయోగముండుటంబట్టి యీవృత్తులన్నియు బురుషుని యం దుపచరింపఁబడుచున్నవి. యోగముఖాలమున వీనికి నిరో

ధమగుటచే వీని ప్రతిబింబము పురుషునిపయిఁ బడఁజాలదు. ఆ సమయమం దేయవస్థ గల్గుచున్నదో దానిని శ్రీపతంజలమహర్షులవా రిట్లు వర్ణించుచున్నారు.

"తదా ద్రష్టుస్స్వరూపేఽవస్థానం"

అప్పుడు పురుషుఁడు తనస్వరూపమునందు నివసింపఁగలఁడు. ఇట్లు యోగప్రాప్తిమూలమున స్వరూపసాక్షాత్కారమగుటచేఁ గైవల్యప్రాప్తి యగుచున్నది. ఇదియే యోగమునకు ఫలము. ఈయోగఫలప్రాప్తియొక్క యుపాయవిషయములోఁ బూజ్యపాదులగుమహర్షులవా రిట్లు చెప్పుచున్నారు.

"అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః"

చిత్తవృత్తిని నిరోధించుట కుపాయములు "అభ్యాసము, వైరాగ్యము" నై యున్నవి .స్వరూపమునందున్నందులకై యత్నించుట, అభ్యాస మనఁబడును. దృష్టా దృష్ట (ఇహలోకపరలోకముల) విషయములలో నపేక్షలేక యుండుటవైరాగ్యమనబడును అభ్యాసవైరాగ్యములవలనఁ జిత్తమున కేకాగ్రత పూర్ణముగాఁ గలిగిన తరువాత నిరుద్ధదశ ప్రాప్తమగును, దీనికే "యోగము" లేక "సమాధి" యనిపేరు. సమాధికిఁగూడ రెండవస్థలు గలవు. సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతము, అని. అసంప్రజ్ఞాతమునకును నాలుగుభేదములు గలవు. వితర్కము, విచారము, ఆనందము

అస్మితము లని నానినామములు. ఎందాఁక స్థూలమును సూక్ష్మము నగు జగత్తుతోఁగూడ దానికంటెఁ బరుఁడు గా నున్న పురుషునిసంబాధ ముంచి వృత్తినిరోధ మగుచున్నదో యట్టిదశ "వితర్క" మని యనఁబడును. జగమును విడిచి కేవలము పురుషసత్తావలంబనపూర్వకమైన నిరోధమునకు "విచార" మని నామము. పురుషునియందుఁ బ్రతిష్ఠితమగు నానందభావములోఁ జిత్తనిరోధ మొనరించి దాని నుపభోగించుదశయే "ఆనంద" మని చెప్పఁబడుచున్నది. దానికంటెను బరమైన కేవలము తన యస్తిత్వానుభవమును జయించెడి నిరోధదశకు "అస్మిత" యని నామము. సవికల్పము లేక సంప్రజ్ఞాతసమాధిలోని యీనాల్గు దశలలోనే ప్రకృతియొక్క సూక్ష్మసంబాధ మున్నది. దీనికంటెఁ బరమైన యసంప్రజ్ఞాతము లేక నిర్వికల్పసమాధిభూమి యున్నది. అందులోఁ బ్రకృతిసంబంధము బొత్తుగా లేనేలేదు.

సంప్రజ్ఞాతము, మఱియు నసంప్రజ్ఞాత మనెడి యీరెండు దశలకు నడుమ నొకయోగవిఘ్నము గలదు. దీనికి "భవప్రత్యయ" మని నామము ఒక్కొక్కసాధకుఁడు చిత్తము నేకాగ్రముగాఁజేయుచు నంతమందు దానినిబ్రకృతియొక్క సూక్ష్మభావములోనే లయము జేయఁగలఁడు. ఇట్లు ప్రకృతివిలీనమైనచిత్తము బుద్ధిలోఁ బ్రతిబింబితమైనచోఁజైతన్యముయొక్క యాభాససుఖము లభించుట కారంభించును. అట్టిసాధకుఁ డాప్రతిబింబిత

సుఖమునే యథార్థానందముగాఁ దలఁచి సంవత్సరములకొలఁది నట్లే జడసమాధిగ్రస్తుఁడై యుండును. హఠలయప్రభృతి వితర్క-విచారములు లేని యోగములసమాధిలో నిట్టి జడసమాధి రూపమైన భ్రాంతి యగుచున్నది. ఇది యొకవిధముగా యోగమునకు విఘ్నము గలిగించునదియై యున్నది. అందువలనభవ ప్రత్యయమున కనఁగాఁ బునస్సంసారమునకుఁ గారణమైనది. ఎందుల కనఁగా? పురుషునియందుఁ జిత్తము లయముగాక యీ జడసమాధిమూలమునఁ బ్రకృతిలోనే లయమగుటచే నట్టిసమాధితోఁగూడిన సాధకునకుఁ దిరిగి పతనము గాఁగలదు. ప్రస్తుత కాలమందు యోగములోని వాస్తవికతత్త్వజ్ఞానము గుర్తెఱుంగకపోవుటంబట్టి యనేకు లీరీతిగా జడసమాధిగ్రస్తులును, లక్ష్యభ్రష్టులు నగు యోగులనే యథార్థయోగులనుగాఁ దలంపమొదలిడుచుండుట దుఃఖకరముగానున్నది. అనేకహఠాదియోగములయొక్క- క్రియలమూలమున శ్వాసప్రశ్వాసములు లేని యప్రాకృతికసమాధి లేక మూర్ఛ నభ్యసించి కృత్రిమయోగులు చాలమంది కల్లకపటము లేని గృహస్థులను జిక్కించుకొని స్వార్థసిద్ధిని ధనరాశులను బొందుచు యోగవిద్యావ్యాపారముగూడఁ జేయఁ బ్రారంభించియున్నారు. వీరిరువదిదినములుసమాధిచేయుట ఆఱునెలలు భూమిలోపలఁ బూడ్వఁబడియుండుట, లోనగు సిద్ధిబొందిన పెక్కు-పనులతోడను, మాటలతోడను బ్రపంచ

మునందు భ్రష్టతను విశేషముగాఁగలిగించుచున్నారు. చక్కగా విచారించినచో నీసమస్తసంగతులు యథార్థయోగమునకుఁ గాని యధ్యాత్మికోన్నతికిఁగాని సంబంధించినవి గావని తెలియఁ గలదు. అయి తేజడసమాధి లేక యింతకంటెనునీచమైన సాధారణ ప్రాణాయామము మున్నగువాని సిద్ధియొక్క మాటలై యున్నవి. వీనివలన యోగి కున్నతిగలుగకపై పెచ్చు పతనము గూడ సంభవించును. అందువలన నంగడివాండ్రగు నీ యోగుల వారినుండి జాగ్రత్తగా నుండుట సర్వజనులకావశ్యకమైయున్నది. సంప్రజ్ఞాతసమాధి యొక్క భవప్రత్యయరూపిరైన విఘ్నమును దూరీకరించుటకు యోగిరాజపతంజలులవా రిట్లు చెప్పుచు న్నారు.

" శ్రద్ధా వీర్య స్మృతి సమాధి ప్రజ్ఞా పూర్వక ఇతరేషాం"

శ్రద్ధ, ఉత్సాహము, స్మృతి, యేకాగ్రత, మఱియు వివేకము లుండుటవలన భవప్రత్యయము జనింపక యసంప్రజ్ఞాత మనఁగా, నిర్వికల్పసమాధి గలుగుచున్నది. ఇది యోగమునకుఁ జరమ ఫలము. ఏ యభ్యాసపరిపాకముచేత యోగి కసంప్రజ్ఞాతదశ ప్రాప్తమగుచున్నదో యోగదర్శన మద్దానిని నెనిమిదియంగ ములలో విభాగించియున్నది. ఎట్లన.

,,యమ, నియ, మాసన, ప్రాణయామ,

ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధయోఽష్టావంగాని

అహింస, సత్యము, అస్తేయము (దొంగిలింపకుండుట) బ్రహ్మచర్యము, వెండియునపరిగ్రహము వీనికి "యమ" మని పేరు. శౌచము, సంతోషము, తపస్య, స్వాధ్యాయము, మఱియు నీశ్వరప్రణిధానములకు "నియమ" మని నామము. ఏప్రకారముగా స్థిరముగను, సుఖముగను కూర్చుండుట, యగునో యది "ఆసన" మని యనఁబడును. శ్వాసప్రశ్వాసములను నియమించి ప్రాణ సంయమము గావించుట "ప్రాణాయామ" మని చెప్పఁబడును. ఇంద్రియములను విషయములనుండి తొలగించుట "ప్రత్యాహార" మని యనెదరు. అంతర్జగత్తుయొక్క యేకదేశమందుఁ జిత్తధారణ మొనరించుట "ధారణ" యని యందురు. ధ్యానలక్షణ మిట్లు చెప్పఁబడినది,

"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం"

చిత్తవృత్తియొక్క యేకతాన ప్రవాహమునకు ధ్యాన మని నామధేయము. ధ్యానసమయములో ధ్యాత (ధ్యానించువాఁడు) ధ్యేయము, (ధ్యానింపఁదగినయిష్టదేవత.) ధ్యానము లనెడి యీ త్రిపుటి యుండును, శ్రీపతంజలిమహర్షులవా రిట్లు సమాధి లక్షణము గావించియున్నారు.

"తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్య మివ సమాధిః"

ఏసమయమందు ధ్యానము పరిపక్వ మగుటవలన ధ్యాత, ధ్యేయము, ధ్యానము, లను మూఁడు, నొకటి యగుచున్నవో

దానికి "సమాధి, యనిపేరు. సమాధి రెండురీతులుగా నుండును. సబీజము, నిర్బీజము, లేక సంప్రజ్ఞాతము అసంప్రజ్ఞాతము లని. సబీజములోఁ త్రిపుటి, లయమైనప్పటిగూడ సూక్ష్మసంస్కార ముండును. నిర్బీజలక్షణమును సూత్రకారులవా రిట్లు సూత్రించియున్నారు.

"తస్యాపి నిరోధే సర్వనిరోధా న్నిర్బీజ స్సమాధిః"

నిర్బీజసమాధిలో నా సూక్ష్మసంస్కారమునకుఁగూడ నిరోధ మగుటవలన సకలవృత్తులకును నిరోధము గాఁగలదు. ఏవృత్తి గూడ నుండ నేరదు. ఈ నిర్బీజసమాధియైన యనంతరమునఁ బురుషుఁడు స్వరూపములో నవస్థానము జేయఁగలఁడు. ఇదియే పాతంజలదర్శనముయొక్క పరమలక్ష్యము. ఈయవస్థలో నవిద్య మున్నగుక్లేశమునుండియు, గర్మరూపమగు నావరణమునుండియు జీవుఁడు ముక్తుఁడు గాఁగలఁడు. అప్పుడు ప్రకృతి, భోగములయొక్కయు, సంసారముయొక్కయు విస్తారము గలిగింపఁ జాలదు,

సమాధిసిద్ధికై యభ్యాసవైరాగ్యములే కాక మఱియొక యుపాయమును శ్రీపతంజలిమహర్షులవా రిట్లు చూపించుచున్నారు.

"ఈశ్వరప్రణిధానా ద్వా"

ఈశ్వరునిభక్తిమూలమునఁగూడ సమాధిలాభము గలుగును. ఈశ్వరప్రణిధానమువలన నే మేమి గాఁగలదు? ఇందుల కా మహర్షులవారే యిట్లు సెలవిచ్చుచున్నారు.

" తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యన్తరాయాభావశ్చ"

ఈశ్వరప్రణిధానఫలముచేత వ్యాధి, సంశయము, ప్రమాదము, మున్నగు చిత్తవిక్షేపకమగు విఘ్నసమూహము దొదవ్వలఁ బరుగిడుచు. మఱియుఁ బురుషోపలబ్ధి గాఁగలదు.

చిత్తమును స్థిరీకరించుటకును, విక్షేపములను దూరీకరించుటకును యోగదర్శనములో నింక ననేకోపాయము లిట్లు చెప్పఁబడియున్నవి.

" తత్ప్రతిషేధార్థ మేకతత్త్వాభ్యాసః"

చిత్తవిక్షేపములను దొలఁగించుటకై యేకతత్త్వ మభ్యసింపఁదగినది.

" మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్య

విషయాణాం భావనాత శ్చిత్తప్రసాదనం"

సుఖి, దుఃఖి, సుకృతి, దుష్కృతులంగూర్చి యథాక్రమము మైత్రీ: కరుణ సంతోషము మఱియు నుపేక్షగలబుద్ధి యుండుటవలనఁ జిత్తప్రసన్నత లభించును.

" ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా ప్రాణస్య"

ప్రాణవాయువుయొక్క నిస్సారణము (వెడలఁబాటు) మఱియు ధారణమూలములను జిత్తస్థైర్య మగుచున్నది.

" విషయవతీ వా ప్రవృత్తి రుత్పన్నా మనసస్స్థితినిబంధినీ"

రూపము, రసము, గంధము లోనగువానిలో నే యింద్రియవిషయం బైననుముఖ్యుఁడుగాక దానియందుఁ జిత్తధారణము గావించినయెడల, జిత్తము స్థిరమగును.

" విశోకా వా జ్యోతిష్మతీ"

శోకరహితమైన సాత్త్వికప్రకృతియొక్క జ్యోతిస్సునందుఁగూడఁ జిత్తమును ధరించినచోఁ జిత్తము శాంతింపఁగలదు.

" వీతరాగవిషయం వా చిత్తం"

రాగరహితులగు పురుషులధ్యానమువలనఁగూడఁ జిత్తము స్థిరమగును.

" స్వప్ననిద్రాజ్ఞానావలంబనం వా"

స్వప్నముయొక్కయు సుషుప్తియొక్కయు మధ్యదశలో జ్ఞానముంచుటచేతను జిత్తము స్థిరమగును.

" యథాభిమతధ్యానా ద్వా"

ప్రకృతి కనుకూలమగు ధ్యానమొనరించుటచేతను జిత్తము స్థిరము గాఁగలదు. ఇట్లు చిత్తము స్థిరమైనపిమ్మట యోగి, దానిని స్థూలసూక్ష్మాతిసూక్ష్మములలో నే యే యవస్థలోఁ బశవేయునో యందే చిత్తము నిర్లిప్తరూపముతో స్ఫటికము వలెఁ దదనురూపముగా నగును. ఈదశకు "సమాపత్తి" యని నామము. దీనికి నాలుగుభేదము లున్నవి. 1 సవితర్కము 2 నిర్వితర్కము 3 సవిచారము 4 నిర్విచారము. వీనింగూర్చి యిట్లు చెప్పఁబడినది.

" తా ఏవసబీజా సమాధిః"

ఇవన్నియు సబీజసమాధిలోనే యంతర్గతము లైనవి. దీనివలనఁ గల్గు ఫలముంగూర్చి యిట్లు చెప్పఁబడినది.

" ఋతంబరేతి తత్ర ప్రజ్ఞా"

దీనిఫలమువలన యోగియందు "ఋతంబర" యనుప్రజ్ఞ యుద యించుచున్నది. దీనివలన స్థూలము, సూక్ష్మము మున్నగు సర్వవిషయములు యోగికిఁ గరతలామలకములు గాఁగలవు. దానివలనఁ గలుగుసంస్కారవిషయములో నిట్లు చెప్పఁబడినది.

" తజ్జస్సంస్కారోఽన్యసంస్కారప్రతిబంధీ"

దానినుండిపుట్టిన సంస్కార మన్యసంస్కారమును బాధించును. కాని యీ యితరసంస్కారమును బాధించెడి సంస్కారము యొక్క విషయములోఁగూడ నిట్లు వ్రాయఁబడినది.

" తస్యాపినిరోధే సర్వనిరోధా న్నిర్బీజ స్సమాధిః"

యోగి, యెప్పు డాసంస్కారమునుగూడ నిరోధముగావించునో యప్పు డద్దానికి నిర్బీజసమాధి లేక యసంప్రజ్ఞాతసమాధియొక్క లాభముగలుగఁగలదు. సాధనావస్థలో యోగాభ్యాసఫలముచే యోగి కనేకములైన సిద్ధులు లేక విభూతు లని చెప్పఁబడెడి యలౌకికశక్తులు లభింపఁగలవు వీనివర్ణనము యోగదర్శనమం దలి తృతీయపాదములోఁ గలదు. ఎట్లనఁగా, సూర్యునియందు సంయమ మొనరించుటచే భువనజ్ఞానమును, జంద్రునియందు సంయమము గావించుటచేఁ దారావ్యూహజ్ఞానమును, సంస్కారములో సంయమ మాచరించుటచేఁ బరచిత్తజ్ఞానమును, గంఠ కూపములో సంయమము జేయుటచే క్షుత్పిపాసానివృత్తియు,

బలమునందలిసంయమముచే హస్తిబలప్రాప్తి లోనగునవి సిద్ధించును. ఈసిద్ధులన్నియుఁ దొలుత సాధనదశలో రుచికరముగా నున్నప్పటికి నాధ్యాత్మికోన్నతిమార్గమునందు బాధాకరములగును. ఎట్లన,

„తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః„

సమాధిరహితుఁడగు పురుషునికొఱకై యివన్నియు సిద్ధిరూపములుగా నున్నవి. కాని సమాధియుక్తుఁడగు యోగి కివి యుపసర్గమాత్రములై యున్నవి.

వేదాంతము మున్నగుదర్శనములలోఁ బ్రారబ్ధము మొదలగు మూఁడువిధములగు కర్మము లొప్పికొనినప్పటికి నీ దర్శనమందు "దృష్టము" అదృష్టము, లనెడి రెండుకర్మములే యొప్పుకొనఁబడినవి, ఎట్లన:—

„ క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్టజన్మ వేదనీయః"

కర్మాశయము, అవిద్య లోనగు క్లేశములయొక్క మూలము. ఇందుదృష్టజన్మ వేదనీయము లనఁగా, ఈవర్తమానజన్మములోని భోగయోగ్యకర్మములు. అదృష్టజన్మ వేదనీయములనఁగా, మఱియొకజన్మమందలి భోగయోగ్యములగు కర్మములు. ఇట్లు కర్మములు రెండువిధములుగా నుండును. యోగప్రభావముచే దృష్టమైనదిగూడ నదృష్టముగాను, అదృష్టమైనదిగూడ దృష్టముగాను గాఁగలదు,

యోగదర్శనము సర్వదర్శనములకంటె నిర్విరోధమును, సర్వహితకారియు నై యున్నది.

—(సాంఖ్యదర్శనము.)—

సాంఖ్యదర్శనమును రచించినవారు కపిలమహర్షులు. తత్త్వసమాసము సాంఖ్యప్రవచనము మున్నగు దీని గ్రంథములనేకములు చిక్కుచున్నవి. ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికగూడ నేఁటికాలములో నున్న ప్రామాణికగ్రంథములలో నొకటియై యున్నది. సాంఖ్యదర్శనములో నేగ్రంథము ప్రాచీనమైన దను విషయములో మతభేద మున్నను విజ్ఞానభిక్షులవారు సాంఖ్యప్రవచననామకగ్రంథమునకే ప్రామాణ్యము నిరూపించియున్నారు. సాంఖ్యప్రవచనసూత్రము లాఱధ్యాయములుగా విభజింపఁబడినవి. మొదటియధ్యాయములో, హేయ, హేయహేతు, హాన, హానహేతు, నిరూపణము గావింపఁబడినది. దుఃఖము హేయము, ప్రకృతిపురుషుల యవివేక మనఁగా నభేదజ్ఞానము దుఃఖహేతువు. దుఃఖము పరిపూర్ణముగా నివారణమగుటయే హానము. మఱియు వివేకజ్ఞాన మనఁగా ప్రకృతిపురుషులపార్థక్యజ్ఞానము. హానహేతు వనఁగా నత్యంతదుఃఖనివృత్తికి హేతువై యున్నది. ఈవిషయములన్నియుఁ ప్రథమాధ్యాయములో వర్ణింపఁబడినవి. రెండవయధ్యాయములోఁ బ్రకృతియొక్క సూక్ష్మకారణమును,మూఁడవయధ్యాయములో స్థూలకార్యము

లింగశరీరము, స్థూలశరీరము, అపరవైరాగ్యము యొక్కయుఁ దత్త్వము నిరూపింపఁబడినది. నాల్గవయధ్యాయములో శాస్త్ర ప్రసిద్ధములైన యనేకాఖ్యాయికల నుల్లేఖించి వివేకజ్ఞానము యొక్క యుపదేశమును, నైదవయధ్యాయములోఁ బరపక్ష ఖండనమును జేయఁబడినది. ఆఱవయధ్యాయములో శాస్త్రము లందలి ముఖ్యవిషయములకు వ్యాఖ్యయు శాస్త్రార్థమున కుప సంహారమును గావింపఁబడినది.

ఇదివఱకుఁ జెప్పబడిన దర్శనములవలె సాంఖ్యదర్శనము నకుఁగూడఁ బ్రతిపాద్యవిషయము దుఃఖనివృత్తియై యున్నది. సంసారము దుఃఖమయము. పురుషార్థమూలమున నా దుఃఖము నివారణము గాఁగలదు. జ్ఞానమే పరమపురుషార్థము. జ్ఞానమూ లమున మనుష్యులకు దుఃఖము నశించి ముక్తిలాభము గలు గును. దీనింగూర్చి యిట్లు వ్రాయబడినది.

"జ్ఞానా న్ముక్తిః"

జ్ఞానముచే ముక్తి గలుగును. ఆజ్ఞానము, ప్రకృతిపురుషుల పార్థక్య జ్ఞానమై యున్నది. కపిలదేవమహర్షులవా రిట్లు వచించు చున్నారు.

"కుత్రాఽపి కోఽపి సుఖీతి తదపి దుఃఖశవల

మితి దుఃఖపక్షే నిక్షిపన్తి వివేచకాః"

సంసారములో సుఖము బొత్తుగా లేదు. సంసారమందే సుఖ మున్నదో యదిగూడ దుఃఖముతోఁగూడికొనినందున దుఃఖ

రూప మైనది. ఇట్లు వివేకిజనులు నిశ్చయించుచున్నారు. సాంఖ్య దర్శనమునం దీదుఃఖమును మూఁడురీతులుగా విభాగించిరి. ఎట్లన, ఆధ్యాత్మికము, ఆధిదైవికము, మఱియు ఆధిభౌతికము లని. ఆధ్యాత్మికదుఃఖము రెండుప్రకారములుగా నున్నది. 1 శారీరకము 2 మానసికము. రోగాదులచేఁ గలిగెడి దుఃఖమునకు శారీరక మనియు, కామము, క్రోధము, లోభము, ఈర్ష్యాశోకమమున్నగువానిచేఁ గలిగెడి దుఃఖమునకు మానసిక మనియుఁ బేళ్లు. దేవతలవలన ననఁగా వాత, వర్ష, వజ్రపాతాదులవలనఁ బుట్టెడి దుఃఖ మాధిదైవికము. మనుజులు, పశువులు, పక్షులు మున్నగు భూతములచేజనించెడి దుఃఖ మాధిభౌతికము. ఎంతవఱకు శరీర ముండునో యంతవఱకీ త్రివిధదుఃఖముల ననుభవింపవలసియే యుండును. దుఃఖము లుపాదేయములుగావు. హేయములైయున్నవి. వాని హానమనఁగా నివృత్తి సకలజీవులకు మనోరథమై యున్నది. కాని క్షణికనివృత్తిలో విశేషలాభము లేదు. అందువలన దుఃఖనివారణము సంపూర్ణముగాఁ గాఁదగినది. ఇదియే జీవునిపురుషార్థము. దీనింగూర్చి సూత్రకారు లిట్లు సూత్రించుచున్నారు.

“ అథ త్రివిధదుఃఖాత్యన్తనివృత్తి రత్యన్తపురుషార్థః”

త్రివిధదుఃఖముల నత్యంతముగా నివారించుట యత్యంతపురుషార్థము. లౌకికోపాయమువలనఁ ద్రివిధదుఃఖనివృత్తి యైనపిదపఁ

గూడ నత్యంతనివృత్తి గానేరదు. ఎందులకనఁగా ఔషధిని సేవించుటవలన శారీరకదుఃఖనివారణమును, నిష్టమును సాధించుటవలన మానసికదుఃఖనివృత్తియు నైనప్పటికిఁగూడ దాని ఫలము క్షణిక మగును. స్థాయిగానేరదు. అందువలనలౌకికోపాయమువలనదుఃఖని వృత్తి గానేరదు.దుఃఖనివృత్తికై వైదికోపాయమున్నది. వేదోక్త యజ్ఞాద్యనుష్ఠానమువలన జీవునకు సుఖమయమగు స్వర్గలాభము గల్గుచున్నది. కాని యీయుపాయముగూడ మంచిదిగాదు. ఎందుల కందురా? కర్మములలోని తారతమ్యము ననుసరించి స్వర్గసుఖమునందుఁగూడఁ దారతమ్యము గలదు. దీనింబట్టిస్వర్గవాసులలోఁ దాపదుఃఖములు గలుగునని తప్పక యూహింపవలయును.

రెండవది పుణ్యకర్మము క్షయమయినందున స్వర్గవాసులకుఁ దిరిగి దుఃఖమయమగు సంసారములోనికి మరలివచ్చి పడుట సంభవించును. కాఁబట్టి సాంఖ్యాచార్యులవారు దుఃఖనివృత్తికై లౌకికమో, వైదికమో, యేయుపాయమైనను మంచిదిగాదని సాంఖ్యకారికలో నిట్లుచెప్పుచున్నారు.

,,దుఃఖత్రయాభిఘాతా జ్జిజ్ఞాసా తదపఘాతకే హేతౌ
దృష్టే సా పార్థా చే న్నైకాంతాత్యన్త తోఽభావాత్"

దుఃఖత్రయముయొక్క యభిఘాతము (పెద్దదెబ్బ) వలన దాని నాశనము కొఱకు జిజ్ఞాస కలుగును. కాని దృష్టోపాయములవల

మున దుఃఖనాశమైనమీఁదఁగూడ నాత్యంతికనాశనము గాఁజా లదు సాంఖ్యసూత్రమునం దిట్లు చెప్పఁబడినది.

"న దృష్టాత్తత్సిద్ధి ర్నివృత్తే ర ప్యనువృత్తి దర్శనాత్"

దృష్టోపాయమువలన నట్టిఫలము గానేరదు. ఎందులకన, దాని వలన దుఃఖనివృత్తియైనతరువాతఁగూడఁ దిరిగి దుఃఖోత్పత్తి కాఁగలదు. ఇంకనం దిట్లు వ్రాయఁబడినది

"దృష్టవ దానుశ్రవికః సహ్యవిశుద్ధిక్షయాతిశయయుక్తః"

దుఃఖనివారణార్థమై దృష్టోపాయమువలె నే యదృష్టోపాయము గూడ యభీష్టమైనది గాదు ఎందుల కనఁగా, దానిలో నవి శుద్ధి క్షయదోషము లున్నవి. అత్తఱి దుఃఖనివృత్తికొఱకు యథార్థమగు నుపాయ మేది? యను విషయమునే నిశ్చయిం చుట సాంఖ్యశాస్త్రోద్దేశ్యమై యున్నది.

సాంఖ్యదర్శనసమ్మతిలో దుఃఖనివృత్తికై కాంతికోపా యము (ముఖ్యోపాయము) ప్రకృతిపురుషులవివేకమై యున్నది. సాంఖ్యకారికయం దిట్లు చెప్పఁబడినది

"తద్విపరీత శ్శ్రేయా న్వ్యక్తావ్యక్తజ్ఞవిజ్ఞానాత్"

ప్రకృతిపురుషుల కుండు భేదము సాక్షాత్కరించుకొనుటయే శ్రేష్ఠతరమగు నుపాయము. అది, వ్యక్త మనఁగా వికృతి. అవ్యక్త మనఁగాఁ బ్రకృతి. మఱియు "జ్ఞ" యనఁగాఁ బురుషుఁడు. ఈమూఁడింటియొక్క విశేషజ్ఞానమువలనఁబుట్టుచున్నది. సాంఖ్య కారికలో ని ట్లున్నది.

" ఏవంతత్త్వాభ్యాసా న్నాస్మి న మే నాహ మిత్యపరశేషమ్.
అవిపర్యయా ద్విశుద్ధం కేవల ముత్పద్యతే జ్ఞానం,,

తత్త్వములను జీటికిమాటికి నభ్యసించుటవలన భ్రమరహిత మగు విశుద్ధజ్ఞాన ముత్పన్న మగును. దీనివలనఁ బురుషున కతఁడు ప్రకృతియొక్క కర్తగాని భోక్తగాని యేదియుఁగూడఁ గాఁడనియు నాప్రకృతికంటె బొత్తుగాఁ బ్రత్యేకించినవాఁడును, నిష్క్రియుండును, జ్ఞానరూపుండును, సాక్షిరూపుండునై యున్నాఁ డనియుఁ దెలియఁగలదు. ఇట్టిదశలో సుఖదుఃఖములు రెండుగూడఁ దిరోభావము లగును. సాంఖ్యసూత్రమం దిట్లు చెప్పఁబడినది.

" నోభయం చ తత్త్వాఖ్యానే"

తత్త్వసాక్షాత్కార మగుటవలన సుఖదుఃఖములు రెండుగూడఁ నుండవు. ఈతత్త్వము, వికారసహితమగు ప్రకృతిని, బురుషునిఁ గైకొని అగి విథములైనది. సాంఖ్యసూత్ర మిట్లు నుడువు చున్నది.

"సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః
ప్రకృతే ర్మహాన్ మహతో౽హంకారః అహంకారా
త్పంచతన్మాత్రా ణ్యుభయ మింద్రియం తన్మాత్రేభ్య
స్థూలభూతాని, పురుష ఇతి పంచవింశతి ర్గణః"

తత్త్వసమాససూత్రమం దిట్లు వ్రాయఁబడినది.

" అష్టౌ ప్రకృతయ ష్షోడశవికారాః పురుషః "

సత్త్వరజస్తమో గుణములను నీ మూఁటియొక్క సమత్వావస్థ మూల ప్రకృతి. దానివికారమగు మహత్తత్త్వమును, మహత్తత్త్వ వికారమగు నహంకార తత్వమును, అహంకార తత్త్వ వికారములగు పంచతన్మాత్రలును, నేకాదశేంద్రియములును, బంచతన్మాత్ర వికారములగు పంచమహా భూతములును, బురుషుఁడును, ఇవియే పంచవింశతి తత్త్వములు. తత్త్వసమాస భాషలో అష్ట ప్రకృతులు, షోడశ వికారములును, బురుషుఁడు అను నివియే పంచవింశతి తత్త్వములై యున్నవి. ప్రకృతి లక్షణవిషయములో నిట్లు చెప్పఁబడినది.

అశబ్ద మస్పర్శ మ రూపమవ్యయం తథాచ నిత్యం రసగంధ వర్జితం
అనాది మధ్యం మహతః పరంధ్రువం, ప్రధాన మేతత్ప్రవదంతి సూరయః

ప్రకృతి, నిత్యము, అవ్యయము, నింద్రియములకును మహత్తత్త్వమునకును మించినదియు, నాది మధ్యములు లేనిదియు, ధ్రువమునైయున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తులో నిట్లు వ్రాయఁబడినది.

అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం
బహ్వీః ప్రజాః స్సృజమానాం సరూపాః ॥

ప్రకృతి యొకటియై యజయునై త్రిగుణమయియునై సజాతీయములగు వికారములను సృష్టించునదియు నైయున్నది. సాంఖ్య సూత్రమం దిట్లు లిఖింపఁబడినది

"పరిచ్ఛిన్నం న సర్వోపాదానం
ప్రకృతే రాద్యోపాదానతా
మూలే మూలాభావాన్మూల మ మూలం
ప్రకృతి పురుష యో రన్యత్సర్వమనిత్యమ్॥"

సత్తుయొక్క అపరచ్ఛిన్నమును, నిర్విశేషమును మూలోపా
దానము నైనది యేదిగలదో యదియే సాంఖ్యశాస్త్ర ప్రతి
పాద్య ప్రకృతి. ప్రకృతికి ఆద్యంతములు లేవు. ప్రకృతికి
ఉత్పాదకుఁ డెవఁడులేఁడు. ప్రకృతి నిత్యము. శ్రీ గీతాకారు
లిట్లు లిఖించిరి.

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః, ప్రభవన్త్యహ రాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే, తత్రైవా వ్యక్త సంజ్ఞకే ॥

ప్రకృతికి "అవ్యక్త" మని నామము ఎందులకనఁగాఁ బ్రలయ
కాలమునందు వ్యక్తమగు జగత్తున కవ్యక్తమగు ప్రకృతిలోఁ
దిరోధానము గలుగుచున్నది. వెండియు సృష్టిసమయమునం
దవ్యక్తమగు ప్రకృతినుండి వ్యక్తమగు జగత్తు జనించుచున్నది.
ప్రకృతికిఁ బరిణామమయి రూపాంతర మాత్రమగును. ఎందుల
కనఁగా, ప్రకృతి, అజయు ధ్రువమును, నిత్యము, సద్వస్తువు
నైయున్నది. సాంఖ్య సూత్రమునందును గీతాశాస్త్రమునందును
నీరీతిగా వ్రాయఁబడినది.

నాఽసదుత్పద్యతే న సన్నశ్యతి ఇతి సాంఖ్యసూత్రమ్

[సాంఖ్య సూత్రము]

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః

(గీతా శాస్త్రము)

అసత్తున కుత్పత్తి లేదు. సత్తునకు వినాశము లేదు. సాంఖ్య
సమ్మతిలోఁ బరిణామము ప్రకృతి స్వభావమై యున్నది.
అనఁగా బ్రకృతి ప్రసవధర్మము గలది. కనుక సామ్యావస్థ

గల ప్రకృతిలోఁ బరిణామ మగుచున్నది. మొదటి పరిణామము మహత్తత్త్వము మఱియు దానియొక్క యపరిణామ అహంకార తత్త్వమై యున్నది. దీనివలన రూపము, రసము, గంధము, స్పర్శము, శబ్దములను నీ పంచ తన్మాత్రలును నేకాదశేంద్రియములు. అనఁగాఁ బంచ జ్ఞానేంద్రియములును, బంచ కర్మేంద్రియములును మనస్సును బుట్టుచున్నవి. ప్రకృతి జడమైనప్పటికిఁగూడఁ బురుషునియొక్క భోగ మోక్షములకొఱకు స్వయముగానే సృష్టి జేయఁగలదు. సాంఖ్య సూత్రములో నిట్లు లిఖింపఁ బడినది.

ప్రధాన సృష్టిః పదార్థం స్వతోఽప్య
భోక్తృత్వా దుష్ట్ర కుంకుమ వహనవత్
అచేతనత్వేఽపి క్షీర వచ్చేష్టితం ప్రధానస్య
కర్మవద్దృష్టే ర్వా కాలాదేః

ప్రకృతి స్వయముగానే సృష్టి యొనరించుచున్నది. ఆ సృష్టి తనకొఱకుఁ జేయదు. కాని ఉష్ట్రముయొక్క కుంకుమవహనము వలెఁ బురుషుని భోగ మోక్షముల సాధనముకొఱకు సృష్టించుచున్నది. దూడయొక్క పుష్టికై అచేతనమగు దుగ్ధమునకు ప్రవృత్తి స్వయముగా నెట్లు గలుగుచున్నదో, లేక ఒక ఋతువైన తరువాత మఱియొక ఋతువు స్వయముగా నెట్లు వచ్చుచున్నదో యట్లే యచేతనమై ప్రకృతిగూడఁ బురుషుని భోగ మోక్షములకై సహజముగానే పరిణామమును బొందఁ గలదు. సాంఖ్యకారిక యందుఁ జెప్పిన దేమనఁగా.

వత్స వివృద్ధి నిమిత్తం క్షీరస్య యథా ప్రవృత్తి రజ్ఞస్య
పురుష విమోక్ష నిమిత్తం, తథా ప్రవృత్తిః ప్రధానస్య ॥

వత్స మభివృద్ధిఁబొందుట కచేతనమగు దుగ్ధమున కెట్లు ప్రవృత్తి గల్గుచున్నదో యట్లు పురుషుని ముక్తి కొఱకై అచేతన ప్రకృతికిఁ బ్రవృత్తి గల్గుచున్నది. ప్రకృతి కిట్టి పరిణామము చేతన పురుషుని సాన్నిధ్య మాత్రముచేత సంపన్నమగు చున్నది. సాంఖ్య దర్శనమందిట్లు చెప్పఁబడినది.

"తత్సన్నిధానా దధిష్ఠా తృవన్మణివత్"

చుంబక (సూదంటురాయి) మేమి చేయకపోయినప్పటికిని కేవలము సమీపమునం దున్నందున నెట్లు లోహమునకుఁ బ్రవృత్తి యగుచున్నదో యట్లే నిష్క్రియుండగు పురుషుని సాన్నిధ్య మాత్రముచేత నే ప్రకృతికి మహదాది రూపము బరిణామ మగుచున్నది. ప్రకృతికి సామ్యావస్థ నష్టమైనపిదపఁ బ్రథమ పరిణామమగును. దానిని మహత్తత్త్వమని యనెదరు. మహత్తత్త్వ వికార మహంతత్త్వము. నిర్విశేషములగు సూక్ష్మ పంచభూతములను బంచతన్మాత్రలని చెప్పెదరు. అహంకారతత్త్వ వికారమువలన యథాక్రమముగాఁ బంచ తన్మాత్రలు, నేకాద శేంద్రియములును గలుగును. పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనస్సునను నీ పదు నొకండు నింద్రియములు. అవిశేష పంచతన్మాత్రలవలనవిశేష పంచస్థూలభూతములగు పృధివ్యప్తే జోవాయ్వాకాశము లుద్భ వించును.

సాంఖ్య మతములో జగత్తు త్రిగుణాత్మకము. ఎందుల కనఁగా. ప్రకృతి త్రిగుణమయిమై యున్నది. ఒక్కొక్క విష యములో సుఖ, దుఃఖ, మోహాత్మకములగు మూఁడు గుణముల యొక్క యధిష్ఠాన ముండుటవలన నొక విషయమే యవస్థా భేదము చేఁ నొకచో సుఖకరమును మఱియొక చో దుఃఖకరమును నింకగొన్ని చోట్లలో మోహకారకము నగుచున్నది. ఎట్లన, స్త్రీ యొక తెయే ప్రియులగువారికి సుఖహేతువు. సవతులకు దుఃఖహేతువును, ఆశలేని ప్రేమగలవారలకు మోహ హేతువు నగుచున్నది సాంఖ్యముయొక్క యిర్వదియైదవ తత్త్వము పురుషుడై యున్నాడు. సాంఖ్య మతములోఁ బురు షుఁడసంగుఁడై నిత్యుఁడై శుద్ధుడై బుద్ధుఁడై మరియు ముక్త స్వభావము గలవాఁడై యున్నాఁడు.

ప్రకృతి జడమును, బురుషుఁడు చేతనుఁడును. బ్రకృతి పరిణామము నొందునదియు, బురుషుఁడు నిర్వికారుఁడును, బ్రకృతి గుణమయియు, బురుషుఁడు నిర్గుణుఁడును బ్రకృతి దృశ్యమును, బురుషుఁడు ద్రష్టయును బ్రకృతి భోగ్యమును, బురుషుఁడు భోక్తయును, గూటస్థుఁడును, అసంగుఁడును, నకర్తయు నింక సాక్షీమాత్రుఁడును నగుచున్నాఁడు. సాంఖ్య మతములోఁ బ్రకృతి యొకటి, పురుషులనేకులు గలరు. సాంఖ్య సూత్రములో నిట్లు చెప్పఁబడినది

"జన్మాది వ్యవస్థాతః పురుష బహుత్వమ్"

అధిక పురుషుఁడు స్వీకరింపక పోయినచో జన్మాదులయొక్క వ్యవస్థ గలుగుటలేదు. సాంఖ్య కారికలోఁ జెప్పినదేమనఁగా.

జన్మ మరణకరణానాం ప్రతినియమాదయుగ పత్ప్రవృత్తేశ్చ పురుషబహుత్వం సిద్ధం త్రైగుణ్య విపర్య యాచ్చ॥

సకలజీవుల కొకటేసారి జన్మ మృత్యువులు గాని యింద్రియ వైకల్యముగాని కాదు. ఒక్క కాలములో నందఱి ప్రవృత్తి గనుపడదు. కొందఱి పురుషులలో నొక గుణము ప్రబలమై యుండును మఱికొందఱిలో మఱియొక గుణ మధికమై యుండును. దీనిఁబట్టి పురుషు లనేకులు గావలసి యుండును. ఇట్టి యుక్తుల మూలమున సాంఖ్య కారులు బహు పురుష వాదము సిద్ధింపఁ జేసిరి. సాంఖ్య జ్ఞానభూమిలో నారోహణము జేసినమీఁద సాధకునకుఁగూడ నిట్టి యుపలబ్ధియే యగుటకు మొదలిడును. సాంఖ్య జ్ఞానభూమి ననుసరించి యేస్వరూపము ఉపలబ్ధియగుచున్నదో యది వ్యష్టియు శరీరావచ్ఛిన్నమును గూటస్థమునగు చైతన్యము యొక్క యుపలబ్ధి యగును. ఆ సమయమం దద్వితీయమును వ్యాపకము నగు చైతన్యము సాక్షాత్కారము గాకపోవుటవలనను బ్రతి పిండమునందు భిన్న భిన్న కూటస్థాత్మలు సాక్షాత్కారమగుటవలనను బహుపురుష వాదము సాంఖ్యజ్ఞానభూమి ననుసరించి సరియైనది. సాంఖ్య మతమునందు సృష్టిదశలోఁ బ్రకృతియుఁ బురుషుఁడును బర స్పరము గూడుకొనియుందురు. ఈకారణమే పురుషునిగుణము

ప్రకృతియందుఁ బ్రకృతిగుణము పురుషునియందు నుపచరితము లగును. సాంఖ్యకారికలో నిట్లు వ్రాయఁబడినది.

"తస్మాత్తత్సంయోగాదచేతనం చేతనావదివలింగం
గుణకర్తృత్వేపి తథా కర్తేవ భవత్యుదాసీనః."

ప్రకృతి పురుషునకుదగ్గరదగ్గరగా నుండుటచేత నచేతనమగు ప్రకృతి చేతనమువలెఁ బ్రతీతి యగుచున్నది. మరియు కర్త గాని పురుషుఁడు కర్తవలె నగుచున్నాఁడు. స్ఫటికముయొక్క సమీపమున జపాపుష్పము (దిరిసెనపువ్వు) నుండుటచేత పుష్పవర్ణము స్ఫటికమునందు ప్రతిఫలించినట్లు ప్రకృతియం దున్న సుఖము, దుఃఖము లోనగునవి పురుషునియం దుప చరింపఁబడుచున్నవి. నిర్మలమైన యద్దమునందు కాలిమ (నలుపు) ప్రతిబింబించి అద్దముయొక్క స్వచ్ఛతను మలినము జేసినట్లు సుఖదుఃఖాదులు గలిగిన ప్రకృతిగూడ పురుషునిఁ గప్పివేయుచున్నది. ప్రకృతి పురుషునియొక్క భోగ్య, భోక్తృ త్వభావములుగలదియునగు అనాదియునగు అవివేకముద్వారాసిద్ధ మైనది, ప్రలయకాలములో అవివేకమువాసనారూపముతో పురు షునిఁ గలిసియుండును. సృష్టిదశయందారీతిగా నేయాయవివేక కారణమువలన నేభోగ్యభోక్తృభావములుగలుగుచున్నవి. సాంఖ్య కారికయం దాచార్యులగు ఈశ్వరకృష్ణులు ప్రకృతిపురుషుల సంయోగమును అంధపంగు సంయోగముగాఁ జేసి వర్ణించిరి ఎట్లనగా—

"పురుషస్య దర్శనార్థం, కైవల్యార్థం తథా ప్రధానస్య
పంగ్వంధవదుభయోరపి సంయోగస్తత్కృతః సర్గః."

కుంటివాఁడు, గుడ్డివాఁడు, వేఱువేఱుగా నున్నప్పు డొక కార్యముగూడ నెగ్గదు. కాని వారిరువురు గలిసియున్నప్పు డనేక కార్యములు నిర్వహింపఁబడఁగలవు. ఎట్లన, గుడ్డివాని మూఁపునఁ గుంటివాఁడు కూర్చుండి చూచెడిశక్తిగల తాను (కుంటివాఁడు) నడచెడిశక్తిగల యతనికి (గుడ్డివానికి) మార్గము జూపుచు నిరువురు మంచిమనుష్యునివలె గమ్యస్థానమును జేరుకొనఁగలరు ఇట్లే నిష్క్రియుండును; చేతనుండునగు పురుషుఁడును సత్క్రియయు, నచేతనయునగు ప్రకృతి, ఈ రెంటియొక్క సంయోగమువలన సృష్టికార్యమగును సృష్టియొక్క యుద్దేశము భోగము, మోక్షమును సాధించుట యైయున్నది కార్యసిద్ధి యైనపిమ్మట కుంటివాఁడు గుడ్డివాఁడు వేఱువేఱయి పోవునట్లు వివేకమువలన పురుషుఁడు ప్రకృతినిజూచి నిత్యంబును, శుద్ధంబును, బుద్ధంబును. ముక్తమును, అసంగమును, అకర్తయును, నిష్క్రియమునగు తనస్వభావమునుగాఁ దలఁచి ప్రకృతినుండి వేఱయిపోవును. ఇదే సాంఖ్యశాస్త్రానుసారముగాఁ గలుగు పురుషునిముక్తి. భగవద్గీతలో నిట్లు చెప్పఁబడినది.

" ప్రకృత్యైవ చ కర్మాణి, క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి.

ప్రకృతిచేత నే సర్వకర్మలు జేయఁబడుచున్నవి. పురుషుఁడు నిష్క్రియుఁడును నకర్తయు నై యున్నాఁడని ఇట్లెవఁడు గనుచున్నాఁడో వాఁడే తత్వదర్శియని యెఱుంగవలెను. తత్వదర్శికిఁ గైవల్యప్రాప్తి కల్గుటయేకాక త్రివిధములగు దుఃఖములు సంపూర్ణముగా నశింపఁగలవు.

సాంఖ్యదర్శనమందు దాని జ్ఞానభూమి ననుసరించిన యీశ్వర సిద్ధి గాకపోయినప్పటికి నలౌకికమును బ్రత్యక్షమునునగు విజ్ఞానముద్వారా యీశ్వరసిద్ధి సర్వవిధములను గాగలదు. సాంఖ్యదర్శనమందలి విజ్ఞానము ననుసరించి యీశ్వరసిద్ధి కావశ్యకత లేకపోయినప్పటికి నాయీశ్వరసిద్ధి మరియొక మార్గము ననుసరించి చేసినందున సాంఖ్యదర్శనముయొక్క యాస్తికత యింకను వృద్ధిజెందినది. ఇందు సందియములేదు. కొందఱు భాష్యకారులకీవిషయము బోధపడలేదు ఈ విషయమును గుర్తెరుంగక చాలమంది యీసాంఖ్యదర్శనమును నిరీశ్వరసాంఖ్యమని వ్యవహరింతురు. ఇదంతయు భ్రాంతి. ఇద్దానితత్త్వము సమగ్రముగ మరొకప్రకరణమందు జెప్పబడును.

## కర్మమీమాంసాదర్శనము

వేదముయొక్క ప్రథమకాండము కర్మకాండము. ఆ కర్మకాండమును మీమాంసఁ జేసెడి దర్శనశాస్త్రము కర్మమీమాంసాదర్శనమని యనెదరు. కర్మము సాధారణరూపము విశేషరూపము లని రెండువిధములుగా విభజింపబడినందువలనఁ గర్మమీమాంసాగ్రంథములు రెండున్నవి. ఒకదానికిఁ బ్రధానాచార్యులు భరద్వాజమహర్షులు. రెండవదానికిఁ బ్రధానాచార్యులు జైమినిమహర్షులు. తొలుత జైమిని మహర్షులవారిచే రచింపఁబడిన దర్శనము వర్ణింపఁబడు చున్నది.

వేదములోని కర్మకాండమును ప్రతిపాదించునది కర్మమీమాం సాదర్శనమై యున్నది. దీనికేఁ బూర్వమీమాంస యనికూడఁ జెప్పెదరు. దీనిప్రవర్తకులు జైమినిమహర్షులు. ఇందుఁ బండ్రెం డధ్యాయములున్నవి యజ్ఞము, అగ్నిహోత్రము, దానము. లోనగు విషయములిందు వర్ణింపఁబడినవి.

ఈకర్మమీమాంసాదర్శనమతములో వేదముయొక్క కర్మకాం డమే సార్థకమై యున్నది. ఇతర కాండముల కెట్టిప్రయోజనము గూడలేదు. ఈమీమాంసలో నిట్లు చెప్పఁబడినది.

"ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదర్థానాం("

కర్మమే వేదమునకుఁ బ్రతిపాద్యవిషయమైనందునఁ గర్మము గాక వేదమున కింకొకయంశము వ్యర్థమగును. వేదములో నే తత్త్వజ్ఞాన ముపదేశింపఁబడినదో దానియుద్దేశ్యము. దేహము నుండి భిన్నమగు ఆత్మకు అస్తిత్వము ప్రమాణీకరించి జీవున కదృష్టములగు స్వర్గము మున్నగువానికి సాధనరూపములైన యజ్ఞయాగములలోఁ బ్రవర్తింపఁజేయుటయే. ఇది జైమినీ మీమాంసాసిద్ధాంతము.

ఈ మీమాంసాదర్శనమతములో వేదము నిత్యము నభ్రాం తము నపౌరుషేయమునై యున్నది. వేదమునకుఁ బ్రణేత యెవ్వఁడునులేఁడు ఋషిలోకము మంత్రద్రష్టలు మాత్రము. వేదముయొక్క ప్రామాణ్యము స్వతస్సిద్ధమై యున్నది. దానిలో జీవుల కల్యాణముకొఱకు యజ్ఞధర్మములు ప్రతిపా దింపఁబడినవి. ఎట్లు?

"యజేత స్వర్గ కామః."

స్వర్గకాంక్షతో యజ్ఞమొనరింపఁదగినది. స్వర్గసుఖలక్షణము శాస్త్రములందెట్లు చెప్పఁబడినదనగా.

"యన్న దుఃఖేన సంభిన్నం నచగ్రస్త మనంతరమ్
అభిలాషోపనీతంచ, తత్సుఖం స్వః పదాస్పదమ్."

ఎట్టిసుఖముతో దుఃఖము గలిసియుండదో దేనిపరిణామమందు దుఃఖము గల్గదో యేది యిచ్ఛామాత్రముననే ప్రాప్తమగు చున్నదో యాసుఖమే స్వర్గమునందుఁ జక్కును. యజ్ఞమొన రించుటవలన నిట్టి స్వర్గసుఖము లభించును. ఎందులకనఁగా యజ్ఞఫలము అలౌకికము. వేదశాస్త్రములందిట్లు నుదహరింపఁ బడినది.

"యజతే ర్జ్యోతిష్టోమపూర్వం
అపామ సోమం అమృతా అభూమ
అక్షయ్యం హవై చాతుర్మాస్య యాజిన స్సుకృతం భవతి
సర్వాన్ లోకాన్ జయతి మృత్యుంతరతి పాప్మానం
తరతి బ్రహ్మహత్యాం తరతి యోశ్వమేధేన యజతే."

యజ్ఞమువలన నమృతతత్త్వము గలుగుచున్నది. మేము యజ్ఞీ యమగు సోమపాన మొనరించి యమరులమైతిమి చాతుర్మా స్యయాగము గావించువాని కక్షయ్యంబగు పుణ్యలాభము గలుగును. అశ్వమేధయాగము జేసినందువలన సమస్తలోకము లను జయింపఁగలఁడు. ఇట్లే మృత్యువునుండియు బాపము నుండియు బ్రహ్మహత్యనుండియు నుత్తీర్ణుఁడు కాఁగలఁడు. ఈమున్నగు వైదికసిద్ధాంతము లీపూర్వమీమాంసయందుఁ జేయబడినవి.

ఈమీమాంసాదర్శనము వేదము నైదువిధములుగా విభాగించినది. (1) విధి (2) మంత్రము (3) నామధేయము (4) నిషేధము (5) అర్థవాదము. వేదములోని యేవాక్యముల మూలమునఁ గర్తవ్యముపదేశింపఁబడుచున్నదో వానిని విధులని వచింతురు. మఱియు నేనిమూలమున నకర్తవ్యము(చేయరానిపనిని) నిషేధింపఁబడుచున్నదో యవి నిషేధములని చెప్పెదరు. ఎట్లన,

'స్వర్గకామోయజేత మాదివా స్వాప్సీః॥

స్వర్గమందలి కోరికతో యజ్ఞమాచరింపవలెను. ఇది విధి. మఱియుఁ బగటిపూటను నిద్దురబోరాదు. ఇది నిషేధము. విధినాలుగుప్రకారములుగా నుండును. (1) ఉత్పత్తి (2) వినియోగము (3) ప్రయోగము (4) అధికారము. ఏవిధిలో కేవలము కర్మమాత్రము యొక్క విధానముండునో దానిని ఉత్పత్తి విధియని యనెదరు. ఎట్లన —

"అగ్నిహోత్రం జుహోతి"

అగ్నిహోత్రముఁగూర్చి హోమము జేయుట యుచితమైయున్నది. కాని హోమమునకై యుచితమాత్రమే గుర్తెఱుంగుట యభీష్టముగాదు. ఏరీతిగా నేదద్రవ్యాల వలన నెవరిని గురించి హోమముజేయుట యుచితమో యదిగూడ నెఱుంగుట యోగ్యమగును. దీనికై వినియోగవిధి యుపదేశింపఁబడినది. ఎట్లన —

"దధ్నా జుహోతి ఇంద్రాగ్నీ ఇదం హవిః"

పెరుగుతో హోమము జేయవలయును. ఇందు ప్రీనిగురించియు నగ్నిగురించియు, హవిస్సున్నది. ఈమొదలగునవి. కాని యింత మాత్రమే యెఱుంగుట చాలదు. ఎందులకనఁగా ఏయజ్ఞములో నేక్రియతరువాత నేక్రియ కనుష్ఠానము గావలసియున్నదో యదిగూడఁ దెలిసికొనుటయు యోగ్యమగును. ఎట్లన,

"అగ్నిహోత్రం జుహోతి యవాగూం పచతి"

ఇఁదు అగ్నిహోత్ర హోమ యవాగూపాకము లనెడి యీ రెండు నుపదేశింపఁ బడినవి. దీనికే ప్రయోగవిధియని పేరు. అటతరువాత నెవరే యజ్ఞమున కధికారులైనదను సంగతిని గూడ విచారించుట యుచితము.

రాజా రాజసూయేన స్వారాజ్య కామో యజేత॥

దీనివలన స్వారాజ్యముకొఱకై రాజసూయమను యజ్ఞ మొనరించుటలో రాజొకఁడే యధికారి కాఁగలడనియు నితరుఁడు గాఁడనియుఁ దెలిసినది. దీనికే యధికారవిధియని నామము. తిరిగి విధివిచారములో నియమ, పరిసంఖ్యలకుగూడ నావశ్యకత యున్నది. ఎట్లన,

"శ్రాద్ధే భుంజీత పితృసేవితం"

శ్రాద్ధమందు మిగిలినది భుజింపదగినది. ఇది నియమవిధి యని యనబడును. ఏవిషయములో మనుష్యుడు స్వేచ్ఛతో బ్రవర్తింపగలడో మఱియు, బ్రవర్తింపఁ జాలఁడో యావిషయము నందు బ్రవర్తింపఁజేయుటకు నియమవిధి యున్నది. "శ్రాద్ధ శేషము భుజింపఁదగినది." ఇట్టి యుపదేశము లేనందువలన

నొకవేళ నొకఁడు శ్రాద్ధమునకు ముందుగానే భుజింపవచ్చును. ఇందులకై యీ నియమవిధి చూపఁబడినది. ఏవిధివలన మనుష్యుల ప్రవృత్తిలో సంకోచము గల్గునో దానిని "పరిసంఖ్యా విధి" యని యనెదరు.

"ప్రోక్షితం మాంసం భుంజీత"

మంత్రములచే సంస్కరింపఁబడిన మాంసము భుజింపఁదగినది. ఎందులకనఁగా, మాంసము దినెడి విషయములో రాజసిక, తామసికులగు మనుష్యుల ప్రవృత్తి స్వాభావికముగా నున్నది. దాని నకస్మాత్తుగా నడ్డగించుటకు వీలులేదు. ఇందులకై యీ హింసా ప్రవృత్తిని క్రమక్రమముగాఁ దగ్గించుటకొఱకీ విధి విధింపఁబడినదనగా మాంస భోజన మేరీతిగాగూడ నొగ నప్పుడు విచ్చలవిడిగా మాంసమును మెక్కక మంత్రములతో సంస్కార క్రియల బొందిన నంజుడు దినఁదగినదను విధి చూపఁబడినది. ఇదియే పరిసంఖ్యా విధికిఁ దాత్పర్యమై యున్నది. యజ్ఞమునకు లక్షీభూతములైన దేవతల నాహ్వానించుటకు లేక స్తుతించుటకు నుపయోగింపఁబడెడి వైదిక శబ్దములను మంత్రములని యనెదరు.

"అగ్నిమీళే పురోహితం" ఇత్యాది

ఇం దగ్ని దేవత స్తుతింపఁ బడినది. మంత్రములోఁ గ్రమ భంగముగాని, శబ్ద విపర్యయముగాని యుచ్చారణ దోషముగాని కలిగినచోఁ గార్యసిద్ధి కానేరదు. మఱియు నొక్కొక్క

సమయములో నశుద్ధోచ్చారణముచే విపరీత ఫలము గాఁగలదు. మహాభాష్యములో నిట్లు చెప్పఁబడినది.

దుష్టః శబ్దః స్వరతో వర్ణతోవా
మిథ్యా ప్రయుక్తో న తమర్థమాహ
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్ర శత్రు స్స్వరతోఽపరాధాత్ ॥

స్వరము వలనఁగాని వర్ణము వలనఁగాని మంత్రమునకు మిథ్యా ప్రయోగ మయినచో నావాక్యము శ్రేయోదాయకము గాక తిరిగి వజ్రమువలె "ఇంద్ర శత్రు" శబ్దము నుచ్చరించుటచేఁ గల్గిన దోషముచే నైనట్లు యజమానిని జంపివేయును. వేదములోని సంహితాభాగ మీలాగున నుండు మంత్రములతోఁ గూర్పఁబడినది. విధేయ విషయమునను సంకోచింపఁజేయుట "నామధేయ"ము యొక్క యుద్దేశ్యము.

ఉద్భిదా యజేత పశు కామః

దీనిలో సాధారణ యజ్ఞవిధి సంకోచింపఁబడినది. అనఁగా యజ్ఞమాత్రము వలననే యిష్టసిద్ధి గానేరదు. ఇఁక నేమన, "ఉద్భిదా" యను పేరుగల యజ్ఞమువలనఁ గాఁగలదు. ఏ వాక్యముతో విధికిఁగాని నిషేధమునకుఁగాని ప్రశంస లేక నింద యొనర్పఁబడుచున్నదో దానిని "అర్థవాద" మని యనెదరు. అర్థవాదము త్రివిధముగా నుండును. (1) గుణవాదము. (2) అనువాదము (3) భూతార్థ వాదము గుణవాద మెట్లనఁగా.

అగ్నిర్హిమస్య భేషజమ్ ... ఆదిత్యో యూపః

సూర్యుఁడు యూపకాష్ఠము గాఁజాలఁడు. కాన దీనికి యూపకాష్ఠము సూర్యునితో సమానముగా మిక్కిలి ప్రకాశించుచున్నదని యర్థమగును. ఇది గుణవాదమునకు దృష్టాంతము. అనువాద మెట్లన—

"అగ్నిర్హిమస్య భేషజం"

అగ్ని, హిమమున కౌషధి. ఈ విషయము నందఱు మొదటి నుండియే గుర్తెఱింగి యున్నారు. వేదమిది చెప్పకపోయినప్పటికిని నేహానియు లేదు. కాఁబట్టి దీనిని "అనువాద" మని నుడివెదరు భూతార్థవాద మెట్లన.

"ఇంద్రో వృత్రాయ వజ్ర ముదయచ్ఛత్"

ఇంద్రుఁడు వృత్రాసురుని జంపుటకై వజ్రాయుధము నెత్తెను.

ఇట్లే పూర్వ మీమాంసా కారులు వేదము కొన్ని చోట్ల సాక్షాత్తుగాను గొన్నిచోట్ల బరంపర రూపముగాను యజ్ఞరూపమయిన ధర్మముయొక్క రహస్యమునే చెప్పుచున్నదని ప్రతిపాదించిరి.

ఈ మీమాంసా మతమునందు యజ్ఞమే ముఖ్యము. ఇంద్రాది దేవతల పేరులతో యజ్ఞము జేసినమీఁదఁగూడ నా దేవతలు గౌణులు ప్రయోజకులు గాను. ఈ మీమాంసయం దిట్లు వ్రాయఁబడినది.

"దేవతావా ప్రయోజయే దతిథి వద్భోజనస్య తదర్థత్వాత్
అపివా శబ్ద పూర్వత్వాద్యజ్ఞ కర్మ ప్రధానం స్యాద్గుణత్వే దేవతా శ్రుతిః"

ఈ మీమాంసా సిద్ధాంతము ననుసరించి దేవతలకు వేఱు సత్తలేదు. మంత్రములే దేవతలు. జైమిని మహర్షి మతములో

యజ్ఞమే మోక్షఫల మొసంగునదియై యున్నది. అయితే క్రియా క్రమోచ్చారణములు సరిగా లేకపోయినచో యజ్ఞము వలన నభీష్టసిద్ధి గానేరదు. ఈ దర్శనములో నీశ్వరుని పేరు లేదు. ఇఁక నేమన—

"బ్రహ్మ ప్రీతి చేత్"

అనెడి ఈసూత్రమందు బ్రహ్మయొక్క యస్తిత్వ (ఉండుట)ము స్వీకరింపఁ బడినది. జైమిని మహర్షి వేదము నపౌరుషేయమని చెప్పెను. కాని యీశ్వర వాక్యమని చెప్పలేదు. ఆతని మతములో వేదకర్త యెవఁడును గాజాలఁడు. శబ్దముయొక్క నిత్యత్వముఏకత్వములే వేదమునకు మూలమై యున్నవి. దీనికై జైమిని మహర్షులు కొన్ని సూత్రములందు శబ్దమునకు నిత్యత్వము సిద్ధింప జేసియున్నారు. ఎట్లన—

నిత్యస్తు స్యాద్దర్శనస్య పరార్థత్వాత్
సర్వత్ర యౌగపద్యాత్
సంఖ్యాభావాత్ అనపేక్షత్వాత్ లింగదర్శనాచ్చ

ఉచ్చారణ మాత్రముననే శబ్దార్థము గ్రహింపఁ బడుచున్నది. శబ్దము నష్టముగాదు. కనుక నిత్యము. ఎల్లప్పు డెల్లచోట్ల నొక శబ్దమున కొక యర్థమే యగును దీనింబట్టికూడ శబ్దమేకము నిత్యమునై యున్నది. శబ్దమునకు వృద్ధి క్షయములు లేవు. ఎందులకనఁగా ఒక్క శబ్దమే మాటిమాటికి నుచ్చరింపఁబడు చున్నను దానిమూలమున వస్తువునకు సంఖ్యావృద్ధి గాదు. మఱియు శబ్దము నష్టమగుటకుఁగూడ నెట్టి కారణము గనుపడదు. ఇదియే నిత్యము, నపౌరుషేయము నగు శబ్దము వేదమై

యున్నది. ఈదృశ వేదవిహిత కర్మానుష్ఠానమే మోక్ష లాభోపాయము.

ఎట్లు సాంఖ్య దర్శనములో, బంచవింశతి తత్త్వములను నిర్ణయించెడి సమయమం దీశ్వర తత్త్వావశ్యకత; తత్త్వజ్ఞాన లాభము కొఱకై యవసరమని తలంపక యీశ్వరతత్త్వము యొక్క ప్రాధాన్యము చూపఁబడి యుండలేదో, అయితే తన మతము ననుసరించి యీశ్వర సిద్ధి గాకపోయినను వేదోక్త విజ్ఞానముయొక్క యాస్తికతను సమర్థించుటకై యలౌకికమగు ప్రత్యక్షోదాహరణ విషయమునం దీశ్వరునియొక్క యస్తిత్వము స్వీకరింపఁ బడినదో, యట్లే మహర్షి జైమినికృత వైదిక కర్మకాండ మీమాంసా ధర్శనమునందు యజ్ఞ ప్రాధాన్యము బ్రతిపాదించుటచే యజ్ఞమునకు మహాత్వమును (గొప్పతనమును) స్థాపించుటకొఱకై దేవతలను గౌణముగాఁ దలంచి యీశ్వరుని విషయములోఁగూడ నధికముగాఁ జెప్పి యుండ లేదు. దీని తాత్పర్య మేమనఁగా దైవీ మీమాంసాదర్శనమున కనురూపమగు నీశ్వర భక్తియొక్కయు, ఋషులయొక్కయు, దేవతల యొక్కయు, పితరుల యొక్కయు శక్త్యాధిక్య మున్నట్లు తలంపఁబడి యుండినచో నత్తఱి వేదోక్తమగు యజ్ఞమునకు మహిమ దగ్గిపోయి యుండెడును. ఈ దర్శనములో వేదోక్త యజ్ఞమునే ముఖ్యమని తలంచిరి ఈ దర్శనముయొక్క ప్రధాన సిద్ధాంత మేమనఁగా. వేదోక్త కర్మకాండము సాధకునకు సర్వ ఫలముల నొసఁగగల దనునది. ఈ దర్శనము

యొక్క సిద్ధాంతము, సాధకుడు వేదోక్త కర్మముల ననుష్ఠించుచు స్వర్గాది సర్వోన్నత లోకములను సుఖముగాఁ బొందఁ గలఁడనియు, ముక్తినిగూడ బొందుననియు నైయున్నది ఇట్లు వేదోక్త కర్మములయొక్క పూర్ణశక్తిని బ్రతిపాదించుటవలన నగతిగా (వేఱు దారిలేక) యీ దర్శన శాస్త్రములో నీశ్వరుని యొక్కయుఁ దదంశములగు దేవతలయొక్కయు గౌణత్వము జూపవలసి వచ్చినది. మఱియు ఆకారణము చేతనే యీదర్శన శాస్త్రమునందు సకామ కర్మకాండమునకే ప్రాధాన్యమీఁ బడినది ఈ ప్రకారము కపిలమహర్షి రచించిన సాంఖ్యదర్శన మందును, జైమిని మహర్షి రచించిన కర్మమీమాంసా దర్శన మందును నీశ్వరునకుఁ బరంపరాయ సంబంధముగాఁ దలంచుటచే నెంతమాత్రము దూషణము గానేరదు. కాని తమ విజ్ఞానమున కాపట్లనుండు నీశ్వరుని బ్రకారాంతరముగా నొప్పికొన్నందు వలన నా రెండు దర్శనముల కది భూషణమే యగుచున్నది.

కర్మ రాజ్యముయొక్క సాధారణ విస్తారము, సాధారణ గతి, సాధారణ శక్తి వీని విజ్ఞానమును బ్రతిపాదించునది భరద్వాజ మహర్షిచే రచింపఁబడిన కర్మ మీమాంసా దర్శనమై యున్నది. ఈ దర్శన గ్రంథము జైమిని దర్శన గ్రంథమున కనురూపముగా నేకదేశి గానట్టి కారణముచే నిందనేక విధములనుండు విజ్ఞానరహస్యములు వర్ణింపఁబడినవి. ఈదర్శన శాస్త్రము నాల్గు పాదములుగా విభాగింపఁబడినది.

ఈ దర్శన శాస్త్రమును జదువనిది కర్మము యొక్క యనాద్యనంత స్వరూపమును, గర్మవిస్తృత రూపమును గుర్తెఱుంగుటకు వీలులేదు. శ్రీ మహాభారతములో నిట్లు చెప్పఁబడినది—

> కర్మణా హి భ్రాన్తి దేవాః పరత్ర । కర్మణైవేహ ప్లవతే మాతరిశ్వా
> అహోరాత్రే విదధత్కర్మణైవ । అతంద్రితశ్శశ్వదుదేతి సూర్యః
> మాసార్ధమాసా నథనక్షత్రయోగా । నతంద్రితశ్చంద్రమా అభ్యుపైతి
> అతంద్రితో దదతే జాతవేదాః । సమిధ్యమానః కర్మకుర్వన్ప్రజాభ్యః
> అతంద్రితా భారమిమం మహాంతం । బిభర్తి దేవీ పృథివీ బలేన
> అతంద్రితా శ్శీఘ్రమపోవహంతి । సంతర్పయంత్యస్సర్వభూతాని నద్యః
> హిత్వా సుఖం మనసశ్చప్రియాణి । దేవశ్శక్రః కర్మణా శ్రైష్ఠ్యమాప
> బృహస్పతిర్బ్రహ్మచర్యం చచార । సమాహితస్సంశితాత్మా యథావత్
> హిత్వా సుఖం ప్రతిరుధ్యేంద్రియాణి । తేన దేవానామగమద్గౌరవం సః
> తథా నక్షత్రాణి కర్మణాముత్ర భాంతి । రుద్రాదిత్యా వసవో–థాపి విశ్వే॥

కర్మ మూలముననే యీ దేవతలందఱు స్వర్గమునందుఁ బ్రకాశించుచున్నారు. కర్మమూలముననే ప్రపంచమందు వాయువు వీచుచున్నది. కర్మమూలముననే యతీంద్రియ భావముతో నహర్నిశలు సంపాదించుచు సూర్యుఁడు నిరంతర ముదయించుచున్నాడు. చంద్రుఁ డాలసింపక మాసములను, పక్షములను, నక్షత్రములను యోగము మొదలగువానిని గలుగఁజేయుచున్నాఁడు. అగ్నిహోత్రుఁ డాలస్యము విడిచి కర్మిష్ఠులగు మనుష్యుల మూలమున హోమమొనరించిన మీఁద బ్రజలకు ఫలదాయకుఁ డగుచున్నాడు. భూదేవి జాగుసేయక సామర్థ్యముతో నీ భూరిభారమును భరించుచున్నది. అట్లే నదులును

తీంద్రియ భావముతోఁ దొందర తొందరగా బ్రవహించుచు నిఖిల ప్రాణులకు సంతృప్తి గూర్చుచున్నవి. దేవతలకుఁ బ్రభు వగు నింద్రుండు తన మనమునకు బ్రియమగు వస్తువును, సుఖ మును విడిచి కర్మబలముననే శ్రేష్ఠత్వమును బొందియున్నాడు. బృహస్పతి, నియత చిత్తుడై సుఖమును విడిచి యింద్రియము లను నిరోధించి బ్రహ్మచర్యమును బాలించియున్నాఁడు. దీని వలన దేవతల నడుమ గౌరవమును బొందెను. మఱియు నక్ష త్రములు, దేవతలు, రుద్రులు, నాదిత్యులు, వసువులు మున్నగునవి యన్నియుగూడఁ గర్మమూలముననే విరాజిల్లు చున్నవి.

కర్మమే జగత్తునకు మూలము. కర్మమువలననే బ్రహ్మాం డమున కుత్పత్తి, స్థితి, లయములగుచున్నవి. కారణవారి కర్మ రూపాంతరమే. వేదములయం దిట్లు నుడువఁబడినది.

ఏకోహం బహుస్యాం ప్రజాయేయ

నాసదా సీన్నో సదాసీత్త దానీం నాఽసీద్రజో నోవ్యోమ పరోయత్ కిమా వరీవః కుహకస్య శర్మన్నాభ్యః కిమాసీ దగహనం గభీరం, న మృత్యు రాసీ దమృతం నతర్హి న రాత్ర్యాహ్న ఆసీత్ప్రకేతః ఆసీదవాతం స్వధయాత దేకం తస్మా ద్ధాన్య న పరః కించనాస కామస్త దగ్రే సమవర్తతా ధిమనసో రేతః ప్రథమం యదాసీత్ సతోబంధు మసతి నిరవిందన హృది ప్రతిష్యా కవయోమనీ షా॥

ఇట్టి శ్రుతుల చారితార్థ్య విషయమునందుఁ గర్మమే కారణమై యున్నది. ఈశ్వరుఁడు రజోగుణమున కధిష్ఠాతయైన బ్రహ్మగా, సత్త్వగుణమున కధిష్ఠాతయైన విష్ణువుగా, దమో

గుణమున కధిష్ఠాతయైన రుద్రుఁడుగా నయి యొక్కొక్క బ్రహ్మాండమున కుత్పత్తి, స్థితి, లయములను జేయుచున్నాఁడు. ఇందులకును గర్మమే కారణము. కర్మమూలముననే యనంత కోటి బ్రహ్మాండముల యొక్క సృష్టి స్థితి లయములగుచున్నవి. బ్రహ్మాండములయొక్క స్థితి దశయందుఁ గర్మమే ధర్మరూపమును బొంది బ్రహ్మాండ రక్షణము జేయుచున్నది. కర్మమే జీవున కుద్భిజ్జ (భూమిలో నుండి పుట్టునవి) స్వేదజ, (చెమట నుండి పుట్టునవి) అండజ (గ్రుడ్డులోనుండి పుట్టునవి) జరాయుజ (మానివలనఁ బుట్టునవి) యోనులలోఁ గ్రమోన్నతిని గలిగించి దేవ దుర్లభమగు మనుష్యయోని ప్రాప్తి గలిగించుచున్నది. మఱియు గర్మమే మనుష్యుని నభ్యుదయ నిశ్శ్రేయసముల కధికారినిగాఁ జేయుచున్నది. కర్మమే ముక్తికిఁ గారణమైనందువలన కర్మమహిమ వేదములందు సర్వ ప్రధానముగా జేసి వర్ణింపఁబడినది. జీవదశా వికాస మన్నిటికంటె మొట్టమొదట నగుచుండెడి సమయమున గర్మమే జీవునకుఁ దోడుగా నుండును. మఱియుఁ బూర్ణజ్ఞానయుక్తుండగు మనుజుఁ డెప్పుడు జీవన్ముక్త దశను బొంది శరీర మంతమైన యనంతరము విదేహ లయమును బొందెడి సమయములోఁగూడఁ గర్మమే చివరదాఁక చేదోడువాదోడుగా వెంటనంటి యుండును. ఈ కారణముచేఁ కర్మముయొక్క ప్రధానతను స్వీకరించు మునులలో రెండు మతములున్నట్లు కన్పడుచున్నది. మొదటిదశలోనుండు మునులీశ్వరుని యస్తిత్వము స్వీకరించుట.

కావశ్యకత లేదని యెంచెదరు. ఎందులకనఁగా, వీరు మొదటి నుండి తుదివరకు గర్మశక్తినే యుపలబ్ధము జేయుచున్నారు. ఈసిద్ధాంతమునే యాశ్రయించి పృథ్విలో జైనమతము, బౌద్ధ మతము మొదలగు ననేక సంప్రదాయములు వెడలినవి. ముందును బయలు వెడలఁగలవు. ఇట్లగుట స్వతస్సిద్ధము. కర్మ ప్రాధాన్యము నొప్పుకొనెడి మునులలోని రెండవ మతము సర్వ వాదిసమ్మతమై యున్నది. ఇది వేదానుకూలమై సర్వులకును మేలుగలిగించునదియై పూర్ణసిద్ధాంతములతో గూడుకొనిన మతమై యున్నది. దీనిని బూజ్యపాదులగు మహర్షులైకమత్య మును బొంది యొప్పికొనియున్నారు. అదియే యీ భరద్వాజ కృత కర్మమీమాంసా మూలమునఁ బ్రతిపాదింపఁబడినది. కర్మయొక్క పూర్ణగతిలో కర్మయొక్క సూక్ష్మాతిసూక్ష్మా వస్థ కర్మయొక్క బీజసంస్కారముయొక్క యుత్పత్తి, స్థితి, లయము ను గర్మయొక్క జడక్రియలో జేతనత్వావశ్యకత మున్నగు సమాధిగమ్యభాగముల నెఱింగెడిమునులు, నిర్వివాద ముగా నీశ్వరుని యస్తిత్వము స్వీకరించుచున్నారు. ఎందుల కందురా? పూర్ణదర్శనము పూర్ణజ్ఞాన సహాయకమైయుండును. పూర్ణజ్ఞానమునందు భ్రాంతిసంభావన యుండదు

వర్ణాశ్రమ ధర్మమముల గోడలను దృఢీకరించుటకై యీ కర్మ మీమాంసా దర్శనము పరమాధారమై యున్నది. ఈశ్వర భక్తిని, ఆస్తికతను గల్గించుటకొఱకీ కర్మమీమాంసా దర్శనము పరమ హితకరము. నాస్తికము మొదలగు మతము

లను నిరాకరించి జన్మాంతర వాదమును సిద్ధింపఁజేయుటకై యీ కర్మమీమాంసా దర్శన మొకటిమాత్రమే యవలంబన మైయున్నది. ఈ కర్మమీమాంసా దర్శనము బాగుగా దెలిసికొనకుండ దైవీ మీమాంసా దర్శనముయొక్కయు, బ్రహ్మమీమాంసా దర్శనము యొక్కయు సిద్ధాంతము లుపలబ్ధములుగానేరవు. కనుక నే యీ కర్మమీమాంసా దర్శనము పరమావశ్యకీయమును సమస్త శ్రేయస్కరము నైనది. ఎట్లు రాజాజ్ఞతో రాజునకు సంబంధము గలదో యట్లే కర్మముతోఁగూడ బ్రహ్మమునకు సంబంధము గలదు. బ్రహ్మమందును, బ్రహ్మశక్తియందును నెట్టి భేదము లేనట్లు కారణబ్రహ్మమందును, కార్యబ్రహ్మమందును భేదములేదు. ఇది యిట్లుండనిండు. ఒక వ్యక్తి, రాజుగారిని బ్రత్యక్షముగా లక్ష్యపెట్టకపోయినను బోవుగాక. కాని రాజుగారి రాజానుశాసనమును జక్కఁగాఁ గొఱతలేక గౌరవించినచో నత్తఱిరాజా జనుసిపై నెట్లుఅప్రసన్నుఁడుగానేరఁడో, మఱియు నొక నరుఁడు నరవరుని కుఱంగట శిరము వంచినప్పటికిని వాని రాజానుశాసనమును నవమానపరచినయెడల నప్పుడెట్లు వాఁడు రాజదండమునకుఁ బాత్రుఁడగుచున్నాఁడో, యీ విజ్ఞానమును గురించి యీశ్వరుని నొకప్పుడు పొరపాటుచే గౌరవింపకపోయిన జనులు కర్మవిజ్ఞానమును జక్కఁగా గౌరవించినచో నీశ్వరుని కృపఁ బొంది యున్నతిని జెందఁగలరు. ఇట్టి విజ్ఞాన సహాయము వలననే తమ తమ దర్శన గ్రంథములను రచించి తమతమ సాధన శైలిని

బ్రవర్తితముగాఁ జేసి జైనప్రభృతి ధర్మ సంప్రదాయము
లభ్యుదయమును బొందుచున్నవి. కానియెవరు రాజానుశాసన
మును రాజును సమానముగా నాదరించుచున్నారో వారెట్లు
నేర్పరులనియు సర్వ యోగ్యులనియుఁ జెప్పబడుచున్నారో
యట్లే యే దర్శన శాస్త్రములోఁ గర్మము, నీశ్వరుఁడను నీ
రెండుగూడ సమానరూపముతో విజ్ఞాన నిర్ణీతములగుచున్నవో
యా దర్శనశాస్త్రమే భ్రాంతిలేనిది బూర్ణము నైనది. ఇందు
సందియము లేదు.

ఏ ప్రకారముగా వాయు సహాయమువలన జలాశ
మునందుఁ దరంగములు లేచుచున్నవో యా ప్రకారముగానే
యనాది వాసనచేఁ బ్రకృతి రాజ్యములోఁ గర్మోత్పత్తి యనాది
సిద్ధమైనది. ఎట్లు ఘాత ప్రతిఘాతములచేఁ దరంగముల స్వరూప
మనంత మగుచున్నదో యట్లే త్రిగుణముల వైషమ్యముచేఁ
గర్మగతి యనంత మగుచున్నది. వైషమ్యావస్థగల ప్రకృతితోఁ
గూడఁ గర్మమునకు స్వాభావిక సంబంధము గలదు కార్య
బ్రహ్మరూపి యగు నీ బ్రహ్మాండముయొక్క ఒక పరమాణువు
గూడ కర్మసంబంధ రహితమైనది లేదు ఈ బ్రహ్మాండములోని
యొక గడ్డిపోచయుఁ గర్మసంబంధము లేకుండ నుండలేదు.
మఱియు నవస్థాంతరమును బొందలేదు. ఈ కారణము వలనఁ
గర్మశక్తి సర్వాతిశాయి. ఏ ప్రకారముగా మహాసముద్రము
లోపల బ్రవహించు నొక గడ్డిపరక యనుకూల తరంగముల
సహాయమును బొందినట్లయిన ఆ తృణము సముద్ర తట

మునకుఁ జేరఁగలదో అట్టుల గానిచో నా గడ్డిపోఁచ జాడ గూడ నుండదో, యా ప్రకారముగానే మనుష్యుఁడు మంచి కర్మముల నాచరించినచో వానికిఁ గ్రమోన్నతి గలిగి తుదను ముక్తి చిక్కునని తప్పక తలఁపవచ్చును. వెండియు నిట్లు గాకచో నప్పుడు వాని జాడగూడ దెలియదు. ఎక్కువగా ననుకూల కర్మములయుఁ బ్రతికూల కర్మములయు రహస్యమును గుర్తెఱింగి యెవఁడు పురుషార్థము లందుఁ బ్రవర్తించుచున్నాఁడో వాఁడే యభ్యుదయమును బొందఁగలఁడు. వెండియు నెవఁడు తత్త్వజ్ఞాన మూలమునఁ గర్మము అకర్మము, వికర్మముల దశ ననుభవించుటలో సమర్థుఁ డగుచున్నాఁడో వాఁడే కర్మ బంధమునుండి దప్పించుకొని నిశ్శ్రేయసమును బొందును.

భరద్వాజ మహర్షిచే రచింపఁబడిన యీమీమాంసా దర్శన శాస్త్రము సాధారణ కర్మ రహస్యమును బ్రతిపాదించును దీనింబట్టి దీని ప్రథమ పాదములో ధర్మలక్షణము, ధర్మాంగములు, ధర్మోపాంగములు, ధర్మాధర్మ శక్తి, యీశ్వర స్వరూపము, ఈశ్వరుఁడే ధర్మాధిష్ఠాత అను విషయముయొక్క విజ్ఞానము ధర్మోపాంగానంతత, పురుష ధర్మ రహస్యము, నారీధర్మ రహస్యము. ఆచారక లక్షణము వర్ణధర్మ రహస్యము. ఆశ్రమధర్మ రహస్యము, బ్రహ్మతేజో వర్ణనము, క్షత్రతేజో వర్ణనము, సతీత్వధర్మ వర్ణనము, ప్రవృత్తి ధర్మ వర్ణనము, నివృత్తిధర్మ వర్ణనము మున్నగు

ననేకావశ్యకీయ కర్మ రహస్య విజ్ఞాన విషయములు వర్ణింపఁ బడినవి. ఈ పాదమునకు "ధర్మపాద" మని పేరు. ఇంక దీని మొదటి రెండు సూత్రము లిట్లున్నవి.

"అథాతో ధర్మజిజ్ఞాసా ।
ధారణాద్ధర్మః"

ఇప్పుడు ధర్మమీమాంసావర్ణనము వచింపఁబడుచున్నది. ధారణము జేయుచున్నందువలన ధర్మమని యనఁబడును.
రెండవ పాదమునకు "సంస్కారపాద"మని నామము. దీని మొదటిసూత్రమిది.

"కర్మబీజం సంస్కారః"

కర్మబీజమును సంస్కారమని యనెదరు. ఈ రెండవ పాదములో సంస్కారలక్షణము, సంస్కారవిజ్ఞానము, సృష్టితో సంస్కారనకు సంబంధము. సంస్కారములోని ద్వివిధప్రధానభేదములు త్రివిధశుద్ధుల యుపాయములు సంస్కారకలాభేదము, వేదోక్త షోడశసంస్కారవిజ్ఞానము, ఉద్భిజ్జము మున్నగు యోనులలోని పంచకోశముల క్రమవికాసవిజ్ఞానము, మనుష్యునియందలి పంచకోశముల పూర్ణతావిజ్ఞానము, సంస్కారశుద్ధితో ముక్తిసంబంధము, రజోవీర్యముల శుద్ధియొక్క మహత్వము, మఱియు దానితోఁగూడ వర్ణధర్మసంబంధవిజ్ఞానము, ముక్తిప్రాప్తిలో వర్ణాశ్రమధర్మసహాయతావిజ్ఞానము, ఆర్యజాతిలక్షణము, ఆర్యజాతినుండి యనార్యజాతి పృథక్త్వము, జాతిధర్మరక్షణవిషయమందు నారీప్రాధాన్యము, జీవోత్పత్తి ప్రవాహవిజ్ఞానము

సంస్కార క్రమశుద్ధిచే జీవుని క్రమోన్నతి విజ్ఞానము, స్థూల సూక్ష్మశరీరవిజ్ఞానము, జన్మాంతరవాదవిజ్ఞానము, జన్మాంతరములో బోవునట్టి ఆతివాహిక దేహముయొక్క విజ్ఞానము. స్వర్గ నరకములవిజ్ఞానము ప్రేతత్వవిజ్ఞానము, సంస్కారశుద్ధితో నజ్ఞాననాశమున సంస్కారశుద్ధిచే వాసనానాశవిజ్ఞానమునను నీమున్నగు విషయములు వర్ణింపఁబడినవి.

మూఁడవపాదమునకు క్రియాపాద"మని పేరు. దీని మొదటి ౧౬ సూత్రములివి.

"ప్రాకృతికస్పందః క్రియా ।
సంస్కారక్రియే బీజాంకురవత్"

ప్రాకృతికమగు కంపనము క్రియయని యనఁబడును. సంస్కారమును, గ్రియయు బీజాంకురములవలె నుండును ఈ పాదమునందుఁ గర్మస్వరూపము. కర్మవైజ్ఞానికరహస్యములు, సంస్కారముతోఁ కర్మసంబంధము, కర్మముతోడ సృష్టియొక్క యేకత్వసంబంధము, సంస్కారము ఒకేతమగు స్థానము, ఆస్థానముల స్వరూపము. సంస్కారశుద్ధిచేఁ గ్రియాశుద్ధియగు విజ్ఞానము, సృష్టిభేదము ప్రత్యేకబ్రహ్మాండ విభాగములోని ప్రత్యేకాధిదైవాస్తిత్వము, కర్మగతి, జడరాజ్యమందలి కర్మప్రవాహముయొక్కయుఁ జేతనరాజ్యమందలికర్మప్రవాహముయొక్కయు విచిత్రత, బంధనము గలిగించుకర్మలలోను, ముక్తినొసంగు కర్మలలోను గలభేదము, కర్మమే బ్రహ్మస్వరూపమనుదాని విజ్ఞానము, యజ్ఞలక్షణము, మహాయజ్ఞలక్షణము, వానితోఁగూడ

సృష్టిసంబంధము, కర్మభేదములు, పాపపుణ్యములరహస్య ములు, పాపపుణ్యముల ఫలములు, కర్మాచరణమునందు మనుష్యుని స్వాధీనత, పూర్వకర్మమాహాత్మ్యము:త్రివిధశుద్ధుల యావశ్యకత, దేశకాలస్వరూపము,కర్మప్రవాహమునకు అనా దిత్వానంతత్వములు, దేశకాలసంబంధముచే గర్మవైచిత్ర్య ము, యుక్తాయుక్తకర్మభేదము; కర్మభోగభేదము, శ్రాద్ధ విజ్ఞానము, కర్మముతోడ వ్యష్టిసమష్టిసంబంధము, ప్రకృతి లోని త్రివిధభేదములయు, సప్తభేదములయు విజ్ఞానము, జ్ఞానకృతకర్మములయొక్కయు, నజ్ఞానకృతకర్మములయొక్కయు భేదము పుణ్యకర్మముల మూలమున జీవుని క్రమోన్నతి విజ్ఞా నము,ధర్మాంగములతోగూడ కర్మములమూలమున జీవునిక్రమో న్నతి విజ్ఞానము, యుక్తకర్మములవలన ముక్తిపదలాభవిజ్ఞా నము, నను నీలోనగు ననేక విషయములు వర్ణింపబడినవి.

నాల్గవపాదమనంగా దుదిపాదమునకు "మోక్షపాద" మని నామము. ఈపాదమందుం గార్యబ్రహ్మకు గారణబ్రహ్మ కును ఏకత, బంధమోక్షకారణవర్ణనము, బీజాంకురవిజ్ఞానము, సత్కర్మాచరణమువలన మోక్షభూమిని బొందెడిక్రమము, క్రియాబీజభేదము, క్రియాగతి నాశవర్ణనము, జీవన్ముక్తుని కర్మగతివర్ణనము, కర్మోత్పత్తియొక్కయు కర్మలయముయొక్కయు విజ్ఞానము, భోగనివృత్తి విజ్ఞానవర్ణనము, వైరా గ్యరహస్యవర్ణనము, నివృత్తిమార్గవర్ణము, యజ్ఞమాహాత్మ్య వర్ణనము, యజ్ఞమహాయజ్ఞములతోం బ్రకృతిసంబంధవర్ణనము:

ప్రకృతిజయోపాయము, ప్రకృతిజయముతో స్వస్వరూపవికా
సముయొక్క సంబంధము, స్వరూపలక్షణము స్వరూపములోఁ
బ్రకృతిలయము, శుక్లగతి, కృష్ణగతి, జీవన్ముక్తిగతి, సంస్కార
శుద్ధిచేఁ గ్రియాశుద్ధియు, క్రియాశుద్ధిచే మోక్షము, కర్మయో
గలక్షణము, జీవన్ముక్తుని యంతఃకరణవృత్తిలక్షణము, కర్మా
భ్యాసయొక్క సప్తావస్థలు, కర్మాకర్మాదిభేదము, కర్మసాధన
ములమహాత్మ్యము, జీవన్ముక్తుని కర్మలక్షణము, జీవన్ముక్తుని
కార్యము భగవత్కార్యమే యగునను నీమొదలగు ననేక
గహనవిషయములు వర్ణింపఁబడినవి.
ఇట్లు శ్రీజైమినిదర్శనము వేదోక్తవిశేషకర్మవిజ్ఞానము యొక్క
యు, శ్రీ భరద్వాజదర్శనము భగవత్కర్మరహస్యము
యొక్కయు, సాధారణకర్మవిజ్ఞానముయొక్కయు సిద్ధాంతము
లను నిర్ణయించునవియైయున్నవి. ఈ రెండుదర్శనగ్రంథములను
జదువకుండ నితరమీమాంసాదర్శనములలోఁ బ్రవేశించుట
సౌకర్యము గలిగించునది గానేరదు. కనుకనే దీనిఁ బూర్వ
మీమాంసాదర్శనమని వ్యవహరించుచున్నారు.

## దైవీమీమాంసాదర్శనము.

భగవంతుఁడు సచ్చిదానందస్వరూపుఁడు. వాని పూర్ణరూప
ముతో సాక్షాత్కరించుకొన నిచ్ఛయున్నచో సద్భావ, చి
ద్భావానందభావముల ప్రాప్తిమూలముననే వానిసాక్షాత్కా
రము గాఁగలదు. ఈకారణమువలననే యీ మూఁడు విధ
ములుగానుండు భావములను బొందుటకొరకే మూఁడు మీ

మాంసలవిజ్ఞాన ముపదేశింపఁబడినది. సద్భావముతోఁ గూడఁ గార్యబ్రహ్మకు ప్రత్యక్షసంబంధమున్నది. ఈకారణముచేఁ బూర్వమీమాంసా (కర్మమీమాంస) దర్శనము కర్మమార్గ సహాయమువలననే ముముక్షువునకు విరాడ్రూపియగు కార్య బ్రహ్మలో వ్యాపకమయిన సద్భావప్రాప్తి గల్గించుచున్నది. చిద్భావముతోఁ గూడఁ గారణబ్రహ్మకుఁ బ్రత్యక్షసంబంధము గలదు. దీనింబట్టియే యుత్తరమీమాంసా (వేదాంత)దర్శనము జ్ఞానమార్గసహాయముననే ముముక్షువునకుఁ బ్రకృతికంటె నతీతమైన కారణబ్రహ్మయొక్క చిద్భావప్రాప్తిని జేయు చున్నది. మఱియు ఆనందభావము. చిద్భావ సద్భావము లలో వ్యాపకమైనది. ఈకారణమువలన దైవీమీమాంసా (మధ్యమీమాంసా)దర్శనము ముముక్షువునునిదివరకుఁ జెప్ప బడినట్టి రెండుమీమాంసలకు గూడ విరోధము లేకుండా బ్రహ్మానందసముద్రములో లీనముజేసి కృతార్థుని జేయు చున్నది. ఈ మూఁడుభావములే ఒక్క పరమభావమునకే యంగరూప మగుటవలన నీభావములలో నొకభావము ప్రా ప్తించిన తర్వాత మిగిలిన రెండుభావములును స్వయముగాఁ బ్రాప్తములగుచున్నవి. పరస్పరము వీనికిట్టిసంబంధ మున్నది. ఇట్టికారణముచేతనే మూఁడుమీమాంసల సాధనమార్గ ములు భిన్నభిన్నములుగానైనప్పటికి లక్ష్య మొకటి యగుట వలన వీనియందు వాస్తవములో భేదము మొదటినుండియు నుంచఁబడలేదు. అన్నమునకుఁ బరిణామరూపమైన శరీరము

సంరక్షించుటకై శరీరముయొక్క యంత్రములలో ముఖము ప్రధానమైనది అన్యమతమువలనఁ బాకస్థలి ముఖ్యమగును. మఱియొక మతమువలన హృద్యంత్రము ప్రధానమగును. ఇట్టి మతభేదములు విచారశీలుడగు పురుషుని నేమియు జేయఁజాలవు. ఎందులకనఁగా, అన్నము మొదట ముఖముమార్గమున నే పాకస్థలిలోఁ బ్రవేశించి రసరూపముగా హృదయములోఁ బ్రవేశించును. మఱియు నాహృదయమందు రక్తముగామారి యావత్తుశరీరమును రక్షించును. ఈకారణమువలన శరీరరక్షణార్థమై మూఁడుయంత్రములెట్లు సమానరూపముగా ఉపకారకములును, సహయోగులునగుచున్నవో యట్లేఒక్క బ్రహ్మయొక్క త్రివిధభావముల తోడ్పాటుతో బ్రహ్మమార్గమందుసంచరించెడిమీమాంసాత్రయమునకునులక్ష్యమొకటియే యైనందున నన్నియుఁబరస్పరము ఉపకారకములును సహయోగులు నగుచున్నవి. ఇందు సందియములేదు. ఎవరుఉన్నతజ్ఞానస్థామునందున్నారో వారు కర్మమునకును, భక్తికిని. లక్ష్యరూపమగు నంతిమభావములోఁ తప్పక చేరియేయుందురు. ఇట్టి యథార్థమైన కర్మయోగికిని, భక్తునకును, మరి రెండధికారములు ప్రాప్తములగుట సులభమగును. దీనింబట్టి మూఁడు మీమాంసలలోని మతభేదమును జూచి సందేహింప నవసరము లేదు

పైన వ్రాయఁబడిన మతభేదము హానికారకము గాకపోయినప్పటికిని యోగదర్శనమువలె దీనికిని ఏదర్శనముతోఁ

గూడ మతభేదము లేదనునది దైవీమీమాంసలోని విశేషత యైయున్నది. కారణమేమనగా, దైవీమీమాంసాదర్శనములోఁ బ్రతిపాదించు విషయము పరమాత్మయొక్క యానందసత్త యైయున్నది ఇట్లానందసత్త, సత్తు, చిత్తు, అను రెంటిలోను వ్యాపకమగుటవలన సద్భావచిద్భావములను రెంటియందు గూడ యానందభావప్రాప్తి యగుచున్నది. దైవీమీమాంసా దర్శనములోని ప్రథమపాదమందు రెండు(సద్భావచిద్భావ) పక్షములనుండి ప్రాప్తమగు నీయానందముయొక్క వర్ణనమే చేయఁబడినది. దీని మొదటిపాదమునకు "రసపాద"మని పేరు. భగవంతుడు రసరూపుఁడు. వేదమునందుఁ జెప్పిన దేమనఁగా—

"రసో వై సః" ఆనందరూపం పరమం యద్విభాతి"

ఈమంత్రములు భగవంతుని రసరూపుని ననఁగా ఆనంద రూపునిగాఁ జెప్పినవి. ఆతని యీయానందసత్త, సత్తు, చిత్తు లను రెంటినడుమనుండియే ప్రాప్తమగుచున్నది. సత్తుతోఁ గార్యబ్రహ్మమునకు సంబంధమున్నందున సద్భావముతోఁ గలిసికొనిన యానందము ప్రకృతిలోఁ బ్రతిబింబించి జీవుని యనుభవములోనికి వచ్చును. ఇందువలన నీయానందమును సుఖమని వచింతురు. పుత్రులఁగూర్చి చేయు స్నేహమును, మిత్ర, కళత్రాదులంగూర్చిన ప్రేమయు, గురువు మొదలగు పెద్దలపైనుండు శ్రద్ధయు మున్నగు నివియన్నియు లౌకికరస మునందు లెక్కింపఁబడును కాని యెప్పుడు సాధకుని చిత్తము లౌకికరసములోని లౌకికత్వమును, మఱియు నాశనమునగుట

యుఁ దెలిసికొని దానినుండి వైరాగ్యముతో గూడినదగుచు నలౌకి (సాక్షాచ్ఛిత్సంబంధయుక్త) కానందములో మగ్నమగుటకై పరిశ్రమజేయుచున్నదో యప్పుడే యీరసము భగవద్భక్తి రూపముతో బయల వెడలి సాధకుని క్రమపూర్వక "వైధీ" మఱియు "రాగాత్మికా" రూపమగు భక్తిలోని రెండు కక్షలయందును క్రమక్రమముగానున్నతుని జేయుచు నంతమునందు "పరాభక్తి" యనుపదమునందు స్థాపితునిజేసి యింక నానందసాగరములో ముంచివేయును. "వైధీ" మఱియు రాగాత్మికా" యను నీరెండుగూడ గౌణభక్తులు. భక్తియొక్క "వైధీ"యనెడి యవస్థయందు సాధకుఁడు, శ్రవణము, కీర్తనము, పాదసేవనము, అర్చనము వందనము మున్నగు తొమ్మిదిరీతులుగా నుండుమెట్లులను వరుసగా నెక్కి రా భగవంతుని యందనురాగము కలుగుటకై యభ్యాసము చేయుచుండును. అటుతరువాత నిష్ఠేయభ్యాసముగజేయగాఁ జేయగా నెప్పుడు వానిపై భగవంతుని కృపగలుగునో యప్పుడాయభ్యాసము యొక్క ఫలముచేతనే భగవంతునింగూర్చి యనురాగము ప్రాప్తముజేయుటలో సాధకుఁడు సమర్థుఁడగును. దీనికే రాగాత్మికాభక్తియని పేరు. విషయికి విషయముపై ననురాగ మెట్లు గల్గునో భక్తునిచిత్తమునం దీసమయములో సరిగా నారీతిగా భగవంతునిగూర్చి యనురాగములేక యొకవిధముగా నుండు ఆసక్తి గలుగుచున్నది. ఈదర్శనమత మేమనఁగా, భావరూపమును దృశ్యమునగు సంసారము పదునాల్గుభాగములందు

విభజింపఁబడినందున నాయాసక్తి ప్రకాశకరసముగూడఁ బదు నాల్గువిధములు గాఁగలదు. వానిలో వీరము, కరుణ, హాస్యము భయానకము: బీభత్సము, అద్భుతము, రౌద్రము, లను నీ యేడురసములు గౌణములు. మఱియు దాస్యము, సఖ్యము, శృంగారము, వాత్సల్యము, ఆత్మనివేదనము, గుణకీర్తనము, తన్మయములను నీ యేడును ముఖ్యరసములు. దైవీమీమాంస యందిట్లు వచింపఁబడినది.

"రసజ్ఞానమపి చతుర్దశధా తత్రసప్తముఖ్యాః సప్త గౌణాః హాస్యాదయో గౌణాః. దాస్యాసక్తి సఖ్యాసక్తి కాంతాసక్తి వాత్సల్యాసక్త్యాత్మ నివేదనాసక్తి గుణకీర్తనాసక్తి తన్మయాసక్తయశ్చ ముఖ్యాః"

ఈచతుర్దశరసములమూలముననే సాధకుఁడు భగవంతుని రాజ్యములో నగ్రేసరుఁడగును. అయినప్పటికి ముఖ్యరసముల ద్వారమునఁ బ్రత్యక్షరూపముగాను, గౌణరసముల ద్వారమునఁ బరంపరారూపముగాను వృద్ధిఁబొందుచున్నాఁడు. భావముయొక్క వైచిత్ర్యమునుబట్టి ముఖ్యాసక్తితో గూడిన భక్తులలో నొకఁడు పరమాత్మను దాసభావముచేత, నొకఁడు సఖ్యభావముచేత, నొకఁడు కాంతాభావముచేత, నొకడు వాత్సల్యభావముచేత, నొకడు ఆత్మనివేదనభావముచేత, నొకడు గుణకీర్తనభావముచేత, నింకొక్కఁడు తన్మయభావముచేత, నిట్లే యనేకభావములచే వానిపై ననురాగముగలవాఁడయి సాధకుఁడు సంసారముయొక్క లౌకికవాసనలను విడిచివేయుచు నత్యంతమగు నానం

దమును, శాంతిని బొందును. ఈప్రకారముగా వానియానంద భావములో భావముగలభక్తుఁడు తీవ్రసంవేగ (పరావైరాగ్య)ముయొక్క యాశ్రయమువలన జగత్తులోనిసమస్తవస్తువులను విడిచివేసి యెప్పుడు రేయింబవలు మనోరూపియైన భ్రమరము భగవంతుని పాదపద్మములందలిమకరంద(పుష్పరస)మును ద్రాగెడి విషయమునందుఁ దత్పరుఁ డగుచున్నాడో ఇతరసర్వవిషయములను వదలుచు వానినే ధ్యానించుట యందెప్పుడున్మత్తుఁడగునో యప్పుడు క్రమక్రమముగా భగవంతుని కరుణవలన సాధకునకిట్టి యొక యున్నతావస్థ కలుగుచున్నది. ఆతరుణమునం దతఁడు తన్మయుఁడై ధ్యేయరూపియగు భగవంతునితోఁ దనకుండు ద్వైతభావమును మరచిపోవును. ఈతన్మయభావముయొక్క పూర్ణత యుండినపిదపనే తిరిగి వానికి "ధ్యాత, ధ్యానము, ధ్యేయములను త్రిపుటి యుండ నేరదు. వాఁడు పరమాత్మతో నేకత్వప్రాప్తిని బొంది "వాసుదేవస్సర్వం" అనఁగా నెల్లచోట్లను బరమాత్మసత్త గన్పడును. ఇదియేపరాభక్తిదశ, ఈయవస్థలో భక్తి విజ్ఞానమునకు నెట్టిభేదములేదు. ఇట్టిప్రకారముగా జ్ఞానియగు భక్తుఁడు నిర్వికల్పమగు సమాధిపదవి నారోహించును. ప్రకృతిలో బ్రతిబింబితమయిన యానందముతో వానిసంబంధ మీపరాభక్తి దశ పరిపక్వమైనమీఁదసంపూర్ణముగాఆగిపోఁగలదు. అప్పుడు వాఁడుప్రత్యక్షముగా చిదానందసముద్రములోమునిగి జీవభావమునుండిముక్తుఁడయిబ్రహ్మభావమును బొందును. ఇదియే దైవీ

మీమాంసాదర్శనమందలి రసపాదముయొక్క అంతమందుఁ బ్రతిపాదించినవిషయము. ఈపాదములోనే భక్తిశ్రేష్ఠత్వమును నుపకారిత్వమును బ్రతిపాదించుటకై యనేకసూత్రము లున్నవి. భక్తిమూలమున నమృతత్వలాభము గలుగును. దీని యాస్వాద మువలన పతనభయము దొలఁగును. మఱియు సమస్తవాస నలు లయము చెందును. సామాన్యభక్తియొక్క యుదయము వలననే మహాపాపములు నశించును. భక్తి సకలోపాసనల కును బ్రాణస్వరూపము. సమస్తధర్మాంగముల కాశ్రయ స్వరూపము, సర్వజాతులకును సమస్తాధికారులకును సమా నముగా మేలును గల్గించునది. పూర్ణతాలాభము గాకపోయి నను దీనిమూలమున నధోగతి గలుగదు. సాలోక్యము మున్న గుపదములు ప్రాప్తించును. ఇటువంటి యనేకవిషయ ములను జెప్పుసూత్రము లిందుఁగలవు. ఈపాదాంతమందున భక్తియొక్క యంతిమదశలోఁగూడ భావభిన్నత యుండుటం బట్టి "ఐశ్వర్య పరా, ఆత్మైకపరా, ఉభయపరా" యనెడి నామములుగల భక్తియొక్క త్రివిధభావములభేదము వర్ణింపఁ బడి మధ్యమీమాంసతోఁ బరమాత్మయొక్క యానందసత్తా ఘనిష్ఠత, దివ్యపద్ధతితోఁ బ్రతిపాదింపఁబడినది.

ఈ మీమాంసాదర్శనములోని రెండవపాదమునకు "ఉత్పత్తిపాదమని నామము. ఉత్పన్నమగుచుండు ప్రపంచము యొక్క లయవిధి యెఱుగనందువలన నెవనికైనను జిత్తమందు సంసారచక్రముయొక్క నిస్సారతయు బరిణామమునందలి

దుఃఖప్రదత్వమును జూచి వైరాగ్యము గలుగనేరదు. ఇట్లు లౌకికమగు స్నేహలతాబంధమును ద్రెంచివేయుచుఁ జిత్తవ్యాకులత, పరమానందలాభమునకై కలుగదు. ఈ కారణమువలననే మరణ మనెడి పరిణామముగల యుత్పత్తిని దెలియఁ జేయుట కీదర్శనశాస్త్రమునం దుత్పత్తిపాద ముంచఁబడినది. సృష్టి యుత్పత్తి కార్యమునందు బ్రహ్మమునకు బ్రహ్మశక్తి స్వరూపిణియగు ప్రకృతికి నేకమాత్రసంబంధము గలదు. ప్రకృతి, జడము. జడవస్తువునకు స్వయముగాఁ గార్యము జేసెడి శక్తి లేదు. ఈకారణమువలన సృష్టికార్యమునందుఁ జేతన బ్రహ్మనావశ్యకత గలుగుచున్నది. ఈసృష్టియే మూఁడు రీతులుగా నున్నది. (1) ఆధ్యాత్మికి (2) ఆధిదైవికీ (3) ఆధిభౌతికీ, అని. ప్రకృతి, యనాది యనంతము నైయున్నది. ఈ కారణమువలననే ప్రాకృతికయు, లీలావైభవస్వరూపిణియు ననంతకోటిబ్రహ్మాండరూపయు నగు నాధ్యాత్మికి. లేక విరాట్సృష్టియు, ననాదియు ననంతము నై యున్నది కాని విరాట్సృష్టి, నిత్యమయినప్పటికి నొక్కొక్క బ్రహ్మాండమునకు లేక యొక్కొక్క జీవుని శరీరరూపమగు పిండమునకు లయము గల్గుచుండును. దీనింబట్టి యాధిదైవికయు, నాధిభౌతికియు నగు సృష్టి, సాదియు సాంతము (ఆద్యంతములుగలది)నై యున్నది. ఒకబ్రహ్మాండము లేక సౌరజగత్తు కాలానుసారముగా నుత్పన్నమగును. అనేకయుగములవఱకును స్థితినిగూడఁ బొందఁ గలదు. మఱియుఁ గాలానుసారముగా లయముగూడఁ బొందఁ

గలదు. ఇట్లే చిత్తు, జడముల గ్రంథిమూలమున నుత్పన్నమగు నొక్కొక్క జీవుఁడుగూడ లక్షలక్షయోనులవఱకు జన్మమరణ చక్రములోఁ బరిభ్రమించి తుదను బరాశక్తివలన గ్రంథిని ఛేదించి విముక్తుఁడు గాఁగలఁడు ఈవిషయముల నన్నిఁటిని సిద్ధాంతీకరించుటకై యీపాదములో నీ సూత్రము లున్నవి.

> 'ఆవాద్యనం తాధ్యాత్మికీ సృష్టిః।
> ఆధిదైవి కాధిభౌతికసృష్టి స్సాది స్సాన్తా।
> చి జ్జడగ్రంథి ర్జీవః।
> తద్భేదనా దుఃఖనాముక్తిః"

సృష్టి రెండువిధములుగలదు. (1) బైజీ (2) మానసీ. బైజీసృష్టి ప్రాకృతికము. కాగా మహర్షులు మనోబలముచే మానసీసృష్టిగూడఁ జేసియుండిరి. సప్తమహర్షులు, ప్రాథమిక సృష్టి జేయుతటి మనోమూలమున నే సృష్టిని గావించియుండిరి. "మనసా ప్రజా అసృజంత" యీమున్నగు శాస్త్రీయవచనములు గూడఁ జిక్కుచున్నవి ఏ కార్యమూలమున నీసృష్టిధారయే, విపరీతమయి లయోన్ముఖమై పోవుచున్నదో దానికే సాధన మని పేరు. అది ప్రవృత్తి నివృత్తి యను మార్గభేదములచే రెండువిధములుగా విభజింపఁబడినది ప్రవృత్తిమార్గము గౌణము. నివృత్తిమార్గము ముఖ్యము. ప్రవృత్తిమార్గములో అధ్యాత్మ చింతనము, శక్తిపూజనమును, భావశుద్ధిమూలమున నున్నతియు ముక్తియు గలుగును. ఇఁక నేమనఁగా, సకల క్రియల లోను సర్వోపాసనములలోను సకలచేష్టలలోఁగూడ సమర్పణబుద్ధి యుండుటచేముక్తిద్వార మతిత్వరితముగాఁ దెరువఁ

బడుచున్నది. అహంకారమే జీవభావమునకుఁ గారణము. వెండియు దానిమూలముననే స్వార్థబుద్ధి ప్రబలమగుచున్నది. సమర్పణమూలమున నీ యహంకారము నశించుటతోడనే స్వార్థమూలికయగు వాసనయొక్క నాశనమైనపూఁద జీవభావము దొలఁగుటచేత శివభావము ప్రాప్తము గాఁగలదు. శ్రీభగవానున కర్పితమగు వస్తువుపై నాత్మీయబుద్ధి నుంచవలదు. వాని విగ్రహము (మూర్తి)పై లౌకికబుద్ధి నుంచవలదు. మరియు వాని ప్రసాదముపై భోగబుద్ధి నుంచవలదు. ఈవిషయములన్నియు సాధనమార్గమునకు సంబంధించిన యున్నతికి సహాయము జేయునవియైయున్నవి. ఈ యుత్పత్తిపాదమునందు సాధకుని యున్నతియొక్క లక్షణవిషయములో భిన్నభిన్న మహర్షి మతములు వర్ణింపబడినవి. ఎట్లనఁగా, పరాశరమహర్షి మతములోఁ బూజాదిరతియు, గర్గమహర్షి మతములో గథారతియు, శాండిల్యమహర్షి మతములో నేకాంతాత్మరతియు, భరద్వాజమహర్షి మతములో గుణకీర్తనరతియు, వశిష్ఠమహర్షి మతములో జగత్సేవారతియు, నింకను గశ్యపమహర్షి మతములో సకలవిషయ సమర్పణబుద్ధియు నైయున్నది. ఇవి భక్తులగు సాధకులయొక్క భగవద్రాజ్యమునందున్నతియొక్క భిన్నభిన్న లక్షణములైయున్నవి. ఎప్పుడు భగవంతునింగూర్చి భక్తునిచిత్తము, వియోగదశలోఁ బతివిరహస్థితయైన సతితో సమానముగా నాతురపడుచున్నదో యప్పుడే యథార్థమగు నున్నతియు, భక్తియు నుదయించునట్లు నిశ్చయింపవలసినదని

దేవర్షులగు నారదులవారు వచించియున్నారు. అయితే యెల్ల
తెఱంగుల నుండు భక్తులును, మాహాత్మ్యజ్ఞానపూర్వకములై
యుండవలెను. అట్లుండనిచోఁ బ్రీతి జారప్రీతివలె నగును.
మఱియు మాహాత్మ్యజ్ఞానపూర్వక మగు యథార్థప్రీతి యున్న
యెడల భక్తున కెప్పటికినిగూడఁ బతనము సంభవింపనేరదు.
అతఁడు క్రమక్రమముగా నధ్యాత్మరాజ్యములోఁ బ్రవేశింపఁ
గలఁడు ఇదియే యుత్పత్తిపాదమందలి తుదిసిద్ధాంతము.

ఉత్పత్తికి రెండవయవస్థ స్థితి యైనందున నుత్పత్తిపా
దముతరువాత స్థితిపాద మీదర్శనమందుఁ జెప్పఁబడినది.
ప్రకృతి గుణమయము భగవంతుఁడు భావమయుఁడై
యుండును. ఇందువలన జగత్తుయొక్క స్థితివశలో నంతట గుణ
భావములలీల చక్కఁగా జూడబడిన దగుచున్నది. భగవంతు
నిలో గుణములును, భావములును గలవు. కాని యాతఁడు గుణ
భావములలో లేఁడు. వేదము గుణభావముతో బూర్ణమైనది.
ఇందువలన వేదము భగవద్వాక్యమును, స్వతఃపూర్ణమును
భ్రమరహితమును నిత్యము నైనది. గుణములను, భావములను
బ్రకాశపరచుచున్నందున స్మృతి మున్నగు శాస్త్రములుగూడ
వేదముతో సమానముగా బ్రామాణికము లగును. ఈ
సిద్ధాంతములంగూర్చి యీదర్శనమం దిట్లు సూత్రములు నుడు
వఁబడినవి—

“తద్వాన్న సో గుణేభావేషు।
గుణభావమయత్వా ద్భగవద్వాక్యం వేదః।

స్వాతః పూర్ణోఽభ్రాన్త్యా నిత్యశ్చ।
తత్ మానీతరాణి తదర్థద్యోతకత్వాత్"

గుణభావమువలనఁ బూర్ణమగు సృష్టిని రక్షించుటకై త్రివిధ శక్తులు సన్నద్ధములై యున్నవి: దీనింబట్టి భగవంతునిశక్తి, సృష్ట్యాదిలో భగవంతునివలననే ప్రకాశితమై తిరిగి ప్రళయ సమయమందు భగవంతునిలోనే లీన మగుచున్నది. ప్రకృతి యొక్క ప్రధానములగు మూఁడువిభాగముల ననుసరించి యీ శక్తియే త్రివిధము లగును. అధ్యాత్మవిభాగమును రక్షించుటకై ఋషిశక్తియు, నధిదైవవిభాగమును రక్షించుటకై దైవశక్తియు అధిభూతవిభాగమును రక్షించుటకై పితృశక్తియు నైయున్నది. జగత్తునందు జ్ఞానప్రచారమును, కాలమునకును యుగమునకును ననుకూలముగా వేదముల యావిర్భావమును ఋషులకరుణ వలననే కాఁగలదు. ఋషిశక్తి నిత్యశక్తియై యున్నది. జీవుల కర్మననుసరించి దేవతలు వారిని నుత్తమగతినో యధోగతినో పొందింపఁగలరు. దైవీజగత్తులో వివిధవిధముల నుండు కార్యములను సాధించుట మున్నగు నధిదైవకార్యములు దేవతలకృప వలననే కాఁగలవు. దేవశక్తి నిత్య మనియు నైమిత్తిక మనియు రెండువిధముల నున్నది. ఇవి యిట్లు సిద్ధాంతీకరింపఁ బడుచున్నవి.

"ఋషిదైవత మాధ్యాత్మికం నిత్యంచ,
పితృదైవత మాధిభౌతికం,
దేవదైవత మాధిదైవికం,
నిత్యనైమిత్తికాశ్చైతే॥"

ఇంద్రుఁడు మొదలగు లోకపాలురగణము నిత్యదేవశక్తి.
ఇట్లేజగత్తులో నేదోయొక దైవకార్యమును సంపాదించుటకు
శ్రద్ధాక్రియామంత్రములమూలమున నొకకేంద్రస్థానమం దా
హ్వానింపఁబడిన నిత్యశక్తియే, దేవగణములయొక్క నైమిత్తిక
శక్తియగును. ఎట్లనఁగా, గ్రామ్యదేవతలు మున్నగునవి స్థూల
జగత్తులోని ఋషులయొక్క వికాసశృంఖలయు, స్థూలజగద్ర
క్షణాపేక్షణమును. స్థూలజగత్తునకు స్వాస్థ్యమొసంగుటయు,
దేశకాలానుసారముగా నన్నపానాదులయొక్క వ్యవస్థ జేయు
టయు నివియన్నియుఁ బితృశక్తి కధీనములై యున్నవి. పితృ
శక్తి నిత్యమనియు నైమిత్తికమనియు రెండువిధములు. అగ్ని
ష్వాత్తా అర్యమాదిపితృగణము నిత్యము. దేహము వదలిన
తరువాతఁ జంద్రలోకమునకుఁబోయి తమ కర్మఫలానుభవము
ననుసరించి నిత్యపితృగణలోకమునందు వాసముజేయుచుండు
పితృగణమునకు నైమిత్తికపితృగణమని పేరు. బ్రహ్మయజ్ఞమూల
మున ఋషులకు వృద్ధియగును. వారభివృద్ధిబొందినమీఁద వ్యష్టి
జగత్తులోను, సమిష్టి జగత్తులోను జ్ఞానశక్తి వృద్ధిగాఁగలదు
యజ్ఞమువలన దేవతలు సంతోషింతురు. వారిసంతోషము
వలన శక్తియు సుఖమును బ్రాప్తింపఁగలవు. ఇట్లే పితృయజ్ఞము
వలనఁ బితరులకానందము గలుగును. వారియానందముచే జీవు
లకు స్వాస్థ్యమును, వీర్యలాభమును గలుగును. భగవంతుని యావ
తారములవలె ఋషులయొక్కయు దేవతలయొక్కయు నవ
తారములుగూడ నగుచుండును. సమిష్టిజగత్తులో ఆసురీశక్తి

ప్రభావ మభివృద్ధి బొందినప్పుడు దైవీశక్తి బలహీనమైన దగు టచేత నధర్మమభివృద్ధియై ధర్మము క్షీణింప మొదలిడును. ఇట్టి యాసురీశక్తి యొక్క ప్రకోపమును రూపుమాపుటకు వ్యష్టి జీవులకుగాని సమష్టిజీవులకుగాని సాధ్యముగానప్పుడే భగ వంతుఁ డావశ్యకతానుసారముగా అంశరూపముతోడనో, పూర్ణ రూపముతోడనో యవతరించి ధర్మమును రక్షించి యాసురి శక్తిననఁగద్రొక్కును. ఇట్లే ప్రకృతియొక్క యాధ్యాత్మిక విభాగములోనో యాధిదైవిక విభాగములోనో జ్ఞానరాజ్యము నందో కర్మరాజ్యమునందో యేకోవిధమైన యలౌకికమగు గడిబిడిగల్గినయెడల ఋషిగణమో లేక దేవతాగణమో యం శరూపముతోడనో పూర్ణరూపముతోడనో యవతరింపఁగలదు. ఈ రెండువిధములనుండు నవతారములే కాక భగవంతుని యొక్కయు, ఋషి, దేవతా, గణములయొక్కయు విశేషము అవిశేషము అనుపేళ్ళఁబరఁగు నింక రెండువిధములగు నవతార ములుగూడఁ గలుగఁగలవు. గురుదేవునిలో దీక్షాదాన సమయమందు విశేషశక్తియు నావేశావతారముగా నావేశిం చుసమయమందవిశేషశక్తియుఁ బ్రకాశింపఁగలదు. అంతః కరణమందు వీరి నిత్యావతారము జీవునిఁ బాపకర్మములనుండి రక్షించి యతని కెల్లప్పుడు మేలుచేయుచుండును. పరమాత్మ యొక్క ప్రత్యక్షశక్తి ముఖ్యముగా మూఁడురీతులుగా నున్నది: బ్రహ్మ, విష్ణు, రుద్రులని. ఈ ముగ్గురి దేవతలవలననే ముప్పది ముగ్గురు దేవతలును, ప్రకృతియొక్క విశాలరాజ్యములోఁగార్య

వైలక్షణ్యముండుటంబట్టి ముప్పదిమువ్వురు దేవతలవలన విస్తృతమై ముప్పదిమూఁడుకోట్లదేవతలు నైరి. భగవంతుని సత్తు, చిత్తు, అను రెండురీతుల నున్న సత్త, యెల్లచోట్లఁ బ్రకాశించుచున్నమీఁదఁగూడ దేవగణమునందుఁ జిత్సత్తయు దేవీగణమునందు సత్సత్తయుఁ బ్రధానముగా నున్నది. ఉపాసనా శ్రద్ధలమూలమున భగవంతునియొక్కయు భగవచ్ఛక్తిసమూహముయొక్కయు కరుణ లభించుచున్నది. ఈయుపాసనము లేక యోగము చతుర్విధముల నున్నది. (1) మంత్రము (2) హఠము (3) లయము (4) రాజయోగము. కార్యబ్రహ్మ లేక జగత్తు నామరూపాత్మకమైనకారణమువలన దివ్యనామ మనఁగా మంత్రమును, మఱియు స్థూలమూర్తి నాశ్రయించుట మూలమున నేయోగ మనుష్ఠింపఁబడుచున్నదో దానికి మంత్రయోగ మని పేరు. స్థూలశరీరమునకు సూక్ష్మశరీరమునకు ఘనిష్ఠసంబంధము గలదు. ఎందులకనఁగా, స్థూలశరీరము సూక్ష్మశరీరముయొక్క వికాసమాత్రమైయున్నది ఈకారణమువలన స్థూలశరీరముపై ఆధిపత్యముజేయుచు నేయోగమువలన సూక్ష్మశరీరముమీఁద సాధపత్యవిస్తారము జేయుటకు వీలుండునో జ్యోతిర్ధ్యానాత్మకమైన యాయోగమునకు హఠయోగ మని నామమై యున్నది. సమష్టివిచారమువలనను, వ్యష్టివిచారము వలనను, బ్రహ్మాండమును, పిండదేహమును నొక్కసంబంధము తోడనే కూడికొని యున్నవి. ఈ బ్రహ్మాండములో నేదేది గలదో యీ పిండదేహములోఁ గూడ వానియన్నిటియొక్క

కేంద్రస్థానమున్నది. కులకుండలినీరూపయగు ప్రకృతిశక్తియొక్కయు, చైతన్యస్వరూపుఁడగు శివునియొక్కయు స్థాన మీ శరీరమునందుఁ గలదు. దీనింబట్టియే యోగమువలన నిదివరకుఁ జెప్పఁబడిన కుండలినీశక్తిని నుద్బోధించి సహస్రారమందుండు శివునిలో లయము జేయఁబడుచున్నదో బిందుధ్యానాత్మకమైన యీయోగమునకే లయయోగ మనిపేరు. మనస్సె సంసారములో బంధమునకును మోక్షమునకును గారణము. ఇందువలననే కేవలము మనస్సాహాయ్యముచేతనే సాధించెడి బ్రహ్మధ్యానాత్మకమైన యోగమునకు రాజయోగ మనిపేరు. రాజయోగమూలముననే నిర్వికల్పసమాధి లభింపఁగలదు. ఈ యవస్థలోనే పరాభక్తి, పరవైరాగ్యము, పరజ్ఞానము, జీవన్ముక్తి మున్నగు నెల్లదర్శనముల యెల్లలక్ష్యములు గూడ నొక భావమందే పరిణతము లగుచున్నవి. ఇట్టి జ్ఞానియగుభక్తుఁడు సచ్చిదానందమనుసాగరములో మునుగుటయొక్కయు తేలుటయొక్కయు, సుఖము ననుభవించుచుఁ గృతార్థుఁడు గాఁగలఁడు. ఇట్టిభక్తి మహాత్ములయొక్కయు, భగవంతునియొక్కయుఁగరుణవలననేకలుగఁగలదు. మహాత్ములసహవాసము దుర్లభము, నమోఘము, విచిత్రము నైనది. భగవంతునిలోను, భగవద్భక్తులలోను, భేద మేమియులేదు. ఈ భగవద్భక్తుల కృపయు, భగవంతుని కరుణవలనఁ కలుగునని దేవర్షియగు నారదునిమతమై యున్నది. దీనబంధువగు భగవంతుని కృపగల్గిన మీఁద నీసాధుసహవాసమువలన భక్తుఁ డుద్ధరింపఁబడును శాం

డిల్యమహర్షిమతములో నహంకృతిని నిరోధించుటవలనను, ద్వై పాయనమహర్షిమతములో దీనత గలిగినమీఁదటను, సాధు సహవాసలాభమును బొందిన భక్తుఁడు ముక్తిపదమునఁ బ్రతిష్ఠి తుఁడు గాఁగలఁ డని యున్నది. ఇదియే స్థితిపాదములోని తుది సిద్ధాంతము. ఉత్పత్తిస్థితుల కధీనమైన దేదైనను లయమునకుఁ గూడ నధీనమై యుండుననునది యీప్రపంచముయొక్క యమోఘసిద్ధాంతమై యున్నది. ప్రపంచముయొక్క యీనియమిత పరివర్తనక్రమమువలన ననులోమవిధి ననుసరించి బ్రహ్మాండముత్పత్తియగును. మఱియుఁ జతుర్ముఖబ్రహ్మకు నూరేండ్లు నిండినమీఁద విలోమవిధి ననుసరించి బ్రహ్మాండమునకులయము గలుగును. ఈప్రలయమే వ్యష్టి, సమిష్టి, విచారములవలన నాల్గువిధముల విభజింపఁబడినది. (1) నిత్యము (2) ఆత్యంతికము (3) నైమిత్తికము (4) ప్రాకృతికము. వీనిలో జగత్తున కెల్లప్పుడు మార్పును గల్గించునది నిత్యప్రలయ మనియు, జీవుని ముక్తివలన గలుగునది యాత్యంతికప్రలయ మనియు, జెప్పఁబడును. ఈరెండును వ్యష్టియందుఁ గలుగును. ఖండప్రలయము లేక నైమిత్తికప్రలయము మఱియు మహాప్రలయము లేక ప్రాకృతికప్రలయము ఈరెండును సమష్టియందుఁ గలుగును. మహాప్రలయములో నెల్లబ్రహ్మాండంబులు ధ్వంసంబై విరాట్టు, ప్రకృతిగర్భమందు లీనమగుటకు ముందు సృష్టిస్థితులలోఁ జూడఁబడెడి దశ, నాస్తిలో అస్తిత్వరూపమగు భ్రమయొక్క యుత్పత్తిని గలిగించెడి మాయయొక్కయే యొక లీలావిలాస

మాత్రమై యున్నది. మాయ త్రిగుణమయమై యున్నది. కాని భక్తులు నాల్గురీతులుగా నున్నారు. ఆర్తులు, జిజ్ఞాసవులు, అర్థార్థులనెడి భక్తులు గుణమయమగు ప్రకృతిలో నంతర్భూతులైనను జ్ఞానియగు భక్తుఁడు గుణాతీతమగు బ్రహ్మపదవి నధిష్ఠించుటకు సమర్థుఁడు గాఁగలఁడు. వాని నిర్మలాంతఃకరణము తటస్థదశలో ధ్యానపరిపాకమునందు సవికల్పసమాధిలాభమును జెందుచు బ్రహ్మముయొక్క యధిదైవము లేక యీశ్వరభావము మఱియు నధిభూతము లేక విరాట్స్వరూపముయొక్క సాక్షాత్కారమును బొందఁగలఁడు వెండియు నటుపిమ్మటఁ గ్రమముగా స్వరూపదశాగతమగు సచ్చిదానందస్వరూపమును, నద్వితీయము నగు బ్రహ్మముయొక్క సాక్షాత్కారముజేయును నిర్వికల్పసమాధిలాభమును బొంది జీవన్ముక్తిపదవి నధిరోహింపఁగలఁడు. మంత్ర, హఠ, లయములను నీమూఁడుయోగముల ధ్యానములును, సగుణమైనందువలన నా యాసమాధులుగూడ సవికల్పము లగుచున్నవి. మంత్రయోగసమాధికి మహాభావ మని పేరు. హఠయోగసమాధికి మహాబోధ యని నామము. లయయోగసమాధికి "మహాలయ"మని నామధేయము నై యున్నది. ఆటుతర్వాత నిర్గుణనిరాకార ధ్యానముయొక్క పరిణామములో నిర్వికల్ప సమాధి యగుచున్నది. భక్తునకు నిర్వికల్పసమాధియైనమీఁదఁ బరాభక్తి దశలో వాని కహంభావ మితఃపూర్వము వచించినరీతిగా నాశనమై సమర్పణబుద్ధి యుదయింపఁగలదు. సమర్పణబుద్ధియొక్క

మొదటిదశలో "వాఁడు నావాఁ"డనియు రెండదశలో "నేను వానివాఁడ"ననియు మూఁడవదశలో "నేనేవాఁ"డనియు నిట్టిభావములు గలుగును. సృష్టియొక్క విస్తారములైన సప్తభేదముల ననుసరించి యీయెల్లభావములయొక్క దశలలో భక్తుఁడు సప్తభావములందు భగవంతునిం జూచుటలో సమర్థుఁడు గాఁగలఁడు ప్రథమదర్శనముఁ దివ్యనామము(మంత్రము) లోఁ గలుగును. ఈసమయమందే మంత్రములయొక్కయు, దేవతలయొక్కయు నేకతాభావమువలన భగవంతునిదర్శనమగుచున్నది. రెండవదర్శనము, దివ్యరూపమునం దగును. ఈతరుణమందే వానియొక్క సగుణమూర్తిసమూహము భావోద్బోధకమయి భగవత్సాక్షాత్కారమునకుఁ గారణమగును. మూఁడవదర్శనము విభూతియందుఁ గాఁగలదు. అప్పుడు జగన్మయమును, వ్యాప్తమునగు వాని విభూతిసమూహము సాధకునిఁ బరమాత్మభావములోఁ భావితుని జేయుచున్నది. నాల్గవదర్శనము- స్థూలసూక్ష్మశక్తులయం దగును. అత్తఱి వానిసూక్ష్మశక్తియొక్క వికాసస్థలమగు నంతఃకరణమునందును, స్థూలశక్తి వికాసస్థల మగు స్థూలజగత్తునందును బరమాత్మదర్శనము గాఁగలదు. ఐదవదర్శనము గుణములం దగును. ఆసమయమందుఁ ద్రిగుణమయ మగు జగత్తులోనీ త్రిగుణవిలాసమును విచారించుటవలనఁ బరాత్పరునియొక్క దర్శనము గాఁగలదు. ఆఱవదర్శనము భావములం దగును, అప్పుడు భావమయంబగు బ్రహ్మముయొక్క మొదటిప్రభావములు కార్యబ్రహ్మమునం

దుండుట చేత భావతత్త్వానుసంధానములో భగవంతునిదర్శ
నము గాఁగలదు. ఏకవదర్శనము స్వరూపమునం దగును. అత్త
ఱి నిర్వికల్పసమాధిదశయందు స్వస్వరూపములో వాని కద్వితీ
యబ్రహ్మశక్తి యొక్క సాక్షాత్కారములభించును. బ్రహ్మ య
ద్వితీయుఁడైనప్పటికిని బ్రహ్మదర్శనముయొక్క యిట్టి సప్తభేద
ములు, కేవలము ప్రకృతి, ప్రవృత్తి, మఱియు శక్తి భేదముల
చేత నగుచున్నవి. అతని యద్వితీయసత్త, యేయేదర్శనములం
దెట్టియెట్టిభావములచేఁ జెప్పఁబడినప్పటికిని సర్వదర్శనముల
తత్త్వానుసంధానము గావించినయెడల నీక్రిందివిధముగా స్పష్ట
ముగాఁగలదు.

కొన్నిదర్శనములయం దతనిని బ్రతిపిండము (దేహము)
నందును గనుటవలన సంఖ్యారూపకముగా నతఁడనంతుఁ డని
చెప్పఁబడినది మఱికొన్నిటియందుఁ బిండరూపమందలి నానా
త్వమునుఁజూపు ప్రకృతియొక్క విలయమునం దతని యనంత
సత్త వ్యాపకముగాఁ బ్రతిపాదింపఁబడినది- ఇదియే సాంఖ్య
లోని బహుపురుషవాదముయొక్కయు బ్రహ్మమీమాంసలోని
యేకాత్మవాదముయొక్కయు నలౌకికతాత్పర్యము, మఱియు
నిదియే ద్వైతముయొక్కయు నద్వైతముయొక్కయు గూఢరహ
స్యము- వానిసత్త, యుపాధిరూపముచే భిన్నభిన్నముగాఁ
బ్రతీయమానమైనప్పటికిని దత్త్వము విచారించినచో నేకము
నద్వితీయమును నైయున్నదానికి భిన్నముగా రెండవ దెన్నటికి
నుండ నేరదు- అనన్యభక్తివలనఁ దటస్థదశ లభించినమీఁద

నిట్లు స్వస్వరూపజ్ఞానోదయ మగుటచే హృదయగ్రంధిభేదము గాఁగలదు, సర్వసంశయములు నశింపఁగలవు, వాసన నశించినతరువాతఁ గర్మలుగూడ నశించును. ఇదియే పరాభక్తి లేక. పరమజ్ఞానముయొక్కదశ, అదృష్టవంతుండగు భక్తుఁడనంతకోటి జన్మములయం దొనర్చిన సుకృతముల వలని ఫలముచే నీదశను బొందఁ గలఁడు. వానికిఁ దిరిగి సుఖదుఃఖ మయమగు సంసార చక్రములోఁ బరిభ్రమించుట యుండదు. అతఁ డాత్యంతిక ప్రలయము లేక విదేహముక్తి లాభమును బొంది యానందమయమగు బ్రహ్మమునందు విలీన మగును. ఆసమయమునందలి వాని యనుభవము, మీమాంసాత్రయము (కర్మ, దైవీ, బ్రహ్మ) లోని లక్ష్యము ననుసరించి త్రిభావాపన్నమై తుదిని నొక్క భావములోనే కలిసిపోవును. "ఈజగత్తే వాఁడై యున్నాఁడు" అనునది కర్మ మీమాంసానుభవమును "వాఁడే యీ జగత్తు" అనునది దైవీ మీమాంసానుభవమును "నేనే వాఁడు" అనునది బ్రహ్మ మీమాంసానుభవము నై యున్నది. సాధకుఁడు శ్రద్ధా, భక్తి. ప్రభావములవలన నొక దశ యనుభవముచే నితరములగు రెండుదశల యనుభవమును బొంది సకల దశలకుఁగూడ సామంజస్యమును గలిగింపఁగలఁడు. ఎందుచేతన గా, అద్వితీయమగు బ్రహ్మముయొక్క యధార్థ జ్ఞాన వికాస మున్నచోట దిరిగి యసామంజస్యమున కవకాశ మెట్లు గల్గును? ఇదియే మధ్యమీమాంస లేక దైవీమీమాంసా

దర్శనములో జెప్పబడిన లయపాదము. ఇద్దియే జీవునియొక్క యంతిమగతియై యున్నది.

-*) బ్రహ్మమీమాంసా దర్శనము (*-

వేదములోని జ్ఞానకాండవ్రతిష్ఠ వేదాంత (బ్రహ్మ మీమాంసా) దర్శనమునకు లక్షీభూతము. ఈ దర్శనము సప్తమజ్ఞానభూమి యైనందువలన సమస్త దర్శనములకు శిరోభూత మైనది. దీనిని బ్రవర్తింపఁజేసినవారు వేదవ్యాస మహర్షులవారు. వేదముయొక్క యంతిమ (జ్ఞానకాండ) మును బ్రతిపాదించుటచే దీనిని "ఉత్తరమీమాంస" యనికూడ జెప్పెదరు. మఱియు బ్రహ్మమే ముఖ్యముగా దీనికి బ్రతిపాద్యవిషయ మైనందున దీనికి "బ్రహ్మమీమాంస" యనియుఁ బేరుగలదు.

వేదాంతదర్శనములో నాలుగధ్యాయము లున్నవి. ఒక్కొక్క యధ్యాయమునకు నాలుగేసి పాదములు గలవు. మొదటి యధ్యాయమునకు సమన్వయ మనునది ప్రధారణ నామము. ఇందనేకప్రకారములుగా నుండు శ్రుతివాక్యములు సమన్వయింపఁబడినవి. ఎట్లనఁగా, ప్రథమాధ్యాయములోని ప్రథమపాదమునందు స్పష్టముగా దెలియఁబరచు శ్రుతిసమూహముయొక్కయు, ద్వితీయపాదమునందస్పష్ట బ్రహ్మభావాత్మకములగు శ్రుతిసముదాయముయొక్కయు, తృతీయపాదమునందును జతుర్థపాదమునందును సంశయాత్మకమగు శ్రుతిసంచయముయొక్కయు సమన్వయ మొనర్పఁబడినది.

ద్వితీయాధ్యాయమునకు "అవిరోధ" మని సాధారణ నామము. దీని మొదటిపాదములో స్వమతమును స్థాపించుటకై స్మృతితర్కాదుల విరోధమును బరిహరించుటయు, రెండవ పాదములో విరుద్ధమతములపై దోషారోపణ మొనరించుటయు, మూడవ పాదములో బ్రహ్మమునుండి తత్త్వము లుత్పత్తియగు టయు, నాల్గవపాదములో భూతవిషయకమగు శ్రుతిసమూ హములలోని విరోధములను బరిహరించుటయు జేయబడినది. మొత్తముమీద నీ యధ్యాయములో బ్రతివాదులగు దార్శని కుల మతములను ఖండించి యుక్తి ప్రమాణములతో వేదవ్యాస మహర్షులవారు వేదాంతమత మవిరోధముగా బ్రతిపాదించి యున్నారు.

మూడవ యధ్యాయమునకు "సాధన" మని సాధారణ నామము. దీనియందు జీవునియొక్కయు బ్రహ్మముయొక్కయు లక్షణములను నిర్దేశించి ముక్తియొక్క బహిరంగసాధనములను, నంతరంగసాధనములును నుపదేశింపబడియున్నవి.

నాల్గవయధ్యాయముయొక్క సాధారణనామము "ఫలము" దీనియందు జీవన్ముక్తియు, జీవోత్క్రాంతియు; సగుణోపాసనముయొక్కయు నిర్గుణోపాసనముయొక్కయు ఫలముల తారతమ్యముగురించిన విచారమును జేయబడినది.

జీవుని నీ దుఃఖమయమగు సంసారమునుండి ముక్తుని గావించి యానందమయమగు బ్రహ్మపదమునందు స్థాపించుట,

వేదాంతదర్శనముయొక్క ముఖ్యోద్దేశము శాస్త్రములో నిట్లు చెప్పబడినవి.

"జీవో బ్రహ్మైవ నాపరః"

జీవుఁడు బ్రహ్మము నొకఁడే. భేదభావమునకు మూల మవిద్యయై యున్నది. అవిద్యావరణములో నావరింపఁబడియే జీవుఁడు తనను బ్రహ్మముకంటె వేఱనితలంచును. కనుకఁ దత్త్వజ్ఞానముదయించుటవలన జీవునకీ యవిద్య దొలఁగినప్పుడే జీవబ్రహ్మముల కైక్యముగల్గినమీఁద జీవునకు ముక్తి గలుగఁగలదు. జీవబ్రహ్మముల కిట్టి యౌపాధిక భేదభావ ముపనిషత్తులం దనేకవిధములుగా వర్ణింపఁబడినది. బ్రహ్మబిందూపనిషత్తులో నిట్లునుడువఁబడినది,

"ఏకఏవ తు భూతాత్మా, భూతే భూతే వ్యవస్థితః
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్"

ఒకయాత్మయే ప్రతిభూతమునందు నున్నది. జలమునందు చంద్రునివలె నొక్కరూపముగను బెక్కురూపములుగను జూపఁబడుచున్నది. యోగవాసిష్ఠమునం దిట్లున్నది.

"స్వయమేవ చిదుల్లాసాత్, జ్వలితాగ్నేః కణాఇవ
సర్వాఏవోత్థితారామ బ్రహ్మణో జీవరాశయః"

అగ్నినుండి స్ఫులింగములవలె బ్రహ్మమునుండి జీవుఁ డుత్పత్తియగుచున్నాఁడు, కనుకనే వేదమహావాక్యములందు జీవబ్రహ్మముల కైక్యము ప్రతిపాదింపఁబడినది. ఎట్లన-

"తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి" "సోహం"

త్వమ్మనఁగా జీవుఁడు. తత్తనఁగా బ్రహ్మము. నేను బ్రహ్మను. జీవునియందును, బ్రహ్మమందును దోఁచు భిన్నత్వము తాత్త్వికము గాదు. భేదప్రతీతి యుపాధికృతము పంచదశియం దిట్లున్నది.

"కోశోపాధివివక్షాయాం, యాతి బ్రహ్మైవ జీవతాం"

కోశరూపమగు నుపాధిని లక్ష్యమొనర్చియే జీవభావమునకు బ్రతీతి యగుచున్నది. సుఖము, దుఃఖము, కామము, క్రోధము, రోగము శోకము మున్నగునవి శరీరముయొక్కయు మనస్సుయొక్కయు ధర్మములై యున్నవి. జీవాత్మయొక్క ధర్మములు కావు. కేవలము శరీరముతోడను మనస్సుతోడను సంయోగమగుటవలన జీవుఁడు తన్ను సుఖిగాను దుఃఖిగాను ననుకొనుచున్నాఁడు. ఇందులకుఁ గారణము మాయయై యున్నది. శాస్త్రములందుఁ జెప్పఁబడిన దేమనఁగా-

"మాహేశ్వరీతి యా మాయా, తస్యా నిర్మాణశక్తివత్
విద్యతే మోహశక్తిశ్చ తం జీవం మోహయత్యసౌ
మోహా దనశతాం ప్రాప్య, మగ్నో వపుషి శోచతి"

మహేశ్వరుని మాయయొక్క మోహశక్తివలననే జీవుఁడు ముగ్ధుఁడగుచున్నాఁడు అట్టిమోహమునకే వశుఁడై జీవుఁడు బ్రహ్మభావమును మరచి తనను కర్తగా, భోక్తగా, సుఖిగా, దుఃఖిగాను దలంచుచున్నాఁడు. ఈభ్రమ, రజ్జువునందు సర్పభ్రాంతిరీతిని, శుక్తియందు రజతభ్రాంతి భాతిని నున్నది. ఇట్టి భ్రమయే నివర్తించుటచేత జీవబ్రహ్మములకు బృథగ్భావము

నశించి యానందమయమగు బ్రహ్మభావములో జీవునకు స్థితి గలుగఁగలదు. వేదాంతదర్శనములో నీదిగువసూత్రము మొదట వ్రాయఁబడినది.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా"

శ్రీశంకరభగవత్పాదాచార్యులవా రీసూత్రములో నున్న "అథ" శబ్దమునకు భాష్య మొనరించుతఱి నిట్లు వ్రాసి యున్నారు.

"విధివ దధీత వేదవేదాంగత్వే నాపాతతో ధిగతాఖిల వేదార్థః, అస్మిన్ జన్మని జన్మాంతరే వా కామ్యనిషిద్ధ వర్జన పురస్సర నిత్యనైమిత్తికప్రాయశ్చిత్తోపాసనానుష్ఠానేన నిర్గత నిఖిల కల్మషతయా నితాంతనిర్మలస్వాంత స్సాధన చతుష్టయ సంపన్నః ప్రమాతా అధికారీ"

యథావిధిగా వేదములను వేదాంగములను నధ్యయనము జేసి వేదార్థమును జక్కఁగా నెఱింగి యీజన్మములోఁగాని జన్మాంతరములోఁగాని కామ్యకర్మలను నిషిద్ధకర్మలను వదలిపెట్టి నిత్య, నైమిత్తిక, ప్రాయశ్చిత్తోపాసనాదుల ననుష్ఠించి పాప రహితుఁడై నిర్మలచిత్తుఁడై శమదమాది సాధనచతుష్టయసం పన్నుఁడైన వాడే బ్రహ్మజ్ఞానలాభమును బొందుట కధికారి. నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రఫలభోగవిరాగము, శమ దమాది షట్సంపత్తి, ముముక్షుత్వము, అనునది సాధన చతుష్ట యము. బ్రహ్మము నిత్యము సంసార మనిత్యము నై యున్న దను నిట్టి విచారమునకు "నిత్యానిత్య వస్తువివేక" మని పేరు. స్రక్చందన, వనితాదులగు నిహలోక సుఖములను, స్వర్గాది

భోగరూపములగు పరలోకసుఖములను నేమాత్రము గూడఁ గోరకుండనుండుట "ఇహాऽముత్ర ఫలభోగవిరాగ" మని యనఁ బడును. బ్రహ్మము కాక యింక నితరవిషయములనుండి మనస్సును మరలించుట "శమ" మని నుడువఁబడును. బాహ్యేంద్రియములను విషయములనుండి నివర్తింపఁజేయుట "దమ"మని చెప్పబడును. వైషయికవస్తువులనుండి చిత్తమును బ్రత్యేకింపజేయుట "ఉపరతి" యని వచింపఁబడును. శీతోష్ణాదిద్వంద్వసహిష్ణుతకు "తితిక్ష" యనిపేరు. గురువాక్యములందును వేదవాక్యములందును, గల్గినవిశ్వాసమునకు "శ్రద్ధ"యని నామము. మఱియు బ్రహ్మమందలి చిత్తకాగ్రతకు "సమాధాన" మని నామధేయము. ఈశమ, దమోపరతి తితిక్ష సమాధాన శ్రద్ధ లను "షట్సంపత్తి"యని వ్యవహరింతురు. నాల్గవసాధనము ముముక్షుత్వమనఁగా ముక్తిలాభమును బొందుకోరికయై యున్నది. ఇట్లు సాధనచతుష్టయసంపన్నుండైనందున వేదాంతమును బఠించుటయందు సాధకున కధికారము గలుగఁగలదు.

ఈ నాలుగధికారములను జూచుటవలననే వేదాంతాధికారమెంతయున్నతమైనదో మఱియు వేదాంతములోని జ్ఞానభూమి, యితరజ్ఞానభూము లన్నిటికంటె నెంత శ్రేష్ఠమైనదియో తెలియును. కారణమేమనఁగా,దీనియందే యద్వైతభావసిద్ధి గలుగఁగలదు. అటుపిమ్మట నధికారమునకుఁ దగినట్లు సాధనము జేయుచు జీవుఁడు ముక్తిభావమును బొందును.

వేదాంతమున బ్రహ్మలక్షణము రెండువిధములుగా వర్ణింపఁబడినది. (1) తటస్థము (2) స్వరూపము. వేదాంత దర్శనమం దిట్లు లిఖింపఁబడినది.

"జన్మాద్యస్యయతః"

ఏపరమాత్మచేఁ బ్రపంచమునకు జన్మాది అనఁగా సృష్టిస్థితి ప్రలయములు గల్గుచున్నవో యదియే బ్రహ్మము. ఈసూత్ర మువలన బ్రహ్మమునకుఁ దటస్థలక్షణము చెప్పఁబడినది. ఇంక బ్రహ్మముయొక్క స్వరూపలక్షణ మీక్రిందిసూత్రమువలనఁ దెలియుచున్నది—

"అదృశ్యత్వాదిగుణకోధర్మోక్తేః"
"ప్రతిషేధాచ్చ"

తటస్థలక్షణమునకు సగుణబ్రహ్మమనియు స్వరూపలక్షణము నకు నిర్గుణబ్రహ్మ మనియు వచింతురు. బ్రహ్మమునం దీరెండు భావములే కలవు. ఎట్లన ?

"ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్"

పాము కుండలముగా (సున్నగా) జుట్టుకొనియుండుటచే దానిని పామనియుఁ గుండల మనియుఁ జెప్పఁగలిగినట్లు బ్రహ్మము నకుఁ గూడ రెండుభావములున్నట్లు తలంపవలెను. స్వరూప భావము మాయకంటె నతీతమును, నిర్గుణమును, నిష్క్రియ మును నై యున్నది. తటస్థభావము మాయతోఁగూడికొనిన చైతన్యముగల యీశ్వరుఁడై యున్నాఁడు. ఈవిషయములో ననేకప్రమాణము లుపనిషత్తులందుఁ జిక్కుచున్నవి. వేదాం

తములో బ్రహ్మమే సత్య మనియు జగత్తు మిథ్యయనియు సిద్ధాంతీకరింప బడినది. మనకుఁ గన్పడెడి జగత్తంతయు బ్రహ్మమందు నామరూపమయయగు మాయయొక్క విలాసము మాత్రమై యున్నది. సాంఖ్యదర్శనములోని పరిణామ వాదము ననుసరించి ప్రకృతియొక్క వికృతియే యీ జగత్తయియున్నది .అనఁగా క్షీరపరిణామముచే పెరుగు, వెన్న, నెయ్యి మొదలగు వస్తువు లగుచున్నట్లు ప్రకృతిపరిణామముచే సృష్టి యగుచున్నది. కాని వేదాంతసిద్ధాంత మిట్లులేదు. వేదాంతదర్శనము ననుసరించి జగత్తు, బ్రహ్మముయొక్క వివర్తమై యున్నది. పరిణామమనఁగా వికారముయొక్కయు వివర్తము యొక్కయు లక్షణ మిట్లుండును.

"సతత్త్వతోఽన్యథా ప్రథా వికార ఇత్యుదీరితః
అతత్త్వతోఽన్యథా ప్రథావివర్త ఇత్యుదాహృతః"

వివర్తమనఁగా వస్తుస్వరూపము మారక వేఱుగాఁ బ్రతీతి యగునది బ్రహ్మము. జగద్రూపముగా మారనేరదు. కాని మాయాసంబంధముచే దానియందు జగద్భ్రాంతి గల్గును. ఎండమావులలో జలములేకపోయినప్పటికి నజ్ఞానియగు పురుషున కామరీచికలయం దుదకభ్రాంతిగలిగిన ట్లద్వితీయ బ్రహ్మమునందు ద్వైతభావమయప్రపంచప్రతీతిగలుగుచున్నది. వాస్తవముగాఁ బ్రపంచము భ్రమమాత్రమై యున్నది అవిద్యాయుక్తుఁడగు చైతన్యజీవుఁడు మిథ్యాప్రపంచమును సత్యరూపముగాఁ దలఁచి సంసారబంధనమందు బద్ధుఁ డగుచున్నాఁ

డు. ఈబంధన మనాది. ఎందుల కనఁగా వేదాంతదర్శన ములో మాయ ననాదియని చెప్పియున్నారు. మాయకు రెండుశక్తులు గలవు. (1) ఆవరణము (2) విక్షేపము. ఆవరణశక్తిచే జీవుఁడు తన్ను వేఱుగాఁ దలంచును. ఇఁక విక్షే పశక్తిచే జగద్భ్రమరూపమగు నఘటనఘటన కాఁగలదు. కనుకనే మాయ అఘటనఘటనాపటీయసి యని చెప్పఁబడు చున్నది. జగత్తు లేనేలేదు. బ్రహ్మమే యున్నది. కాని దాని లో జగత్తు గలదను కల్పన ముత్పన్నమగుచున్నది. ఇదియే మాయాశక్తి ఇంద్రజాలమునం దైంద్రజాలికుఁడు సూత్రి సహాయముతో శూన్యమార్గమం దాడి జనుల కనులయెదుట జీవించియున్న మనుష్యులను దుత్తునియలుగాఁజేసి నఱికివేయును. అగ్నియందు శరీరమును దగ్ధముజేసివేయును. కాని యిదం తయు మిథ్య. సరిగా నీప్రకారమే ప్రపంచముఁగూడ మిథ్య యగును. జీవుఁ డీవిషయము గుర్తెఱుఁగక బద్ధుఁ డగుచు న్నాఁడు. సూర్యుఁడు మేఘచ్ఛన్నుఁడైనందువలన దృష్టి గోచరుఁడు గానట్లు సత్యజ్ఞానరూపమగు బ్రహ్మ మసత్య మగు నజ్ఞానముయొక్క యధికారమువలనఁ గప్పఁబడినమీఁద జీవుఁడు దానిస్వరూపమును గుర్తెఱుంగఁజాలఁడు. ఖండముగా నున్న యొక చిన్నమేఘము లక్షలకొలఁది యోజనములను వ్యాపించిన సూర్యునిఁ గప్పివేయఁజాలదు. కాని యజ్ఞానియగు వాఁ డెట్లు మేఘముచే సూర్యుఁడు గప్పఁబడినట్లు దలఁచి దానిచే సూర్యుని బ్రభాహీనునిగాఁ దలంచెడిభ్రమను జెందునో

యట్లే మిథ్యయగు జగత్తును సత్యరూపమని తలంచి జీవుఁడు భ్రాంతినిఁ బొందియున్నాఁడు ఎట్లన-

"ఘనచ్ఛన్నదృష్టి ఘనచ్ఛన్నమర్కం
యథా నిష్ప్రభం మన్యతే చాతిమూఢః
తథా బద్ధవ ద్భాతి యో మూఢదృష్టేః
స నిత్యోపలబ్ధి స్వరూపోఽయ మాత్మా"

మూఢుఁడు మేఘము కనులను గప్పివేసినప్పుడు సూర్యుఁడే మేఘాచ్ఛన్నుఁడు తేజోవిహీనుడు నైనట్లు తలఁచిన విధమున జీవుఁడు బ్రహ్మరూపియైనప్పటికి నజ్ఞానముచేఁ దనను బద్ధునిగా దలచుచున్నాడు. జీవునకే బంధకము తాత్త్వికము కాదు. కాని కల్పనామాత్రమై యున్నది. ఎందుల కనఁగా, జీవుఁడు ముక్త స్వభావము గలవాఁడై యున్నాఁడు. గౌడపాదాచార్యులవా రీరీతిగా వ్రాయుచున్నారు.

"నవిరోధో న చోత్పత్తి ర్న బంధో న చ సాధకః
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥

వాస్తవమునం దాత్మ కుత్పత్తి లేదు. వినాశము లేదు. బంధనము లేదు. మోక్షములేదు, సాధనము లేదు. మఱియు మోక్షేచ్ఛయు లేదు. వేదాంతమతమునందు ముక్తి సాధ్యముకాదు. కాని సిద్ధవస్తువు. జీవుఁడు స్వయముగానే ముక్తుఁడు. ఈ విషయమునకు దృష్టాంత మేమన-

"కంఠచామీకరవత్"

ఒక పిల్లవాని మెడలోఁ గంఠహారము ఉండెను. ఒకనాఁడు మెడలోఁ గంఠహారము లేదని భ్రాంతిపడెను. దానిచే వ్యాకు

లము జెంది వెదుక మొదలిడెను. ఎక్కడఁగూడ దండజాడ దెలియక పోయె. తుట్టతుదకు మఱియొకఁడు దండమైనచో నా పిల్లవాని కంఠమందు మొదటి నుండియే యున్నది. ఎందులకు వెదకుచున్నారని యడిగెను. అప్పడు బాలకుని భ్రమ దొలగిపోయెను. జీవుని ముక్తి గూడ నిట్లేయుండును. జీవుఁడు స్వభావముగా ముక్తుఁడే. కేవల మనాద్యవిద్యయొక్క ఛాయచేఁ దనను బద్ధునిగాఁ దలంచుకొనును. సద్గురు కరుణచేఁ దత్త్వజ్ఞానము కలిగినఁమీఁద నవిద్య దొలఁగి పోఁగలదు. ఆ సమయమందు జీవుఁడు "తాను నిత్యుఁడు, శుద్ధుఁడు బుద్ధుడు ముక్త స్వభావుఁడ నని గుర్తెఱుంగును. ఇదియే జీవన్ముక్తి.

జగత్తు భ్రమమాత్రమై యున్నది. బ్రహ్మ మాయాశక్తి వలన జగద్భ్రమను గల్గించుచున్నాడు. ఇది యైంద్రజాలికము. (కనుకట్టు విద్య) ఇంద్రజాలము విస్తరింపఁజేసి మిథ్యా ప్రపంచమును సత్యరూపముగాఁ జూపుచున్నాఁడు. వాస్తవముగా నంతయు శూన్యమే- ఇట్లు విచారించి విచారించి హ్యూం, (Hume) మిల్లు (Mill) మొదలగు పాశ్చాత్య దార్శనిక పండితులు చాలమంది బౌద్ధుల శూన్యవాదమునఁ జేరబడిరి. కాని వేదాంతములోని యద్వైతవాద మిట్టి శూన్యవాదము గానేరదు- దీని మతమునఁ జగద్భ్రమ కాధారము శూన్యముగాదు. ఇఁక నేమన? సచ్చిదానంద మయమగు బ్రహ్మము శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు శూన్యవాదమును బరిహరించుటకై యిట్లు నుడువుచున్నారు-

" న తావ దుఃఖయ ప్రతిషేధ ఉపపద్యతే. శూన్యవాద ప్రసంగాత్
కించిత్ హి పరమార్థ మాలంబ్య అపరార్థః ప్రతిషిధ్యతే
యథా రజ్జ్వాదిషు సర్పాదయః"

జగత్తు; జగదాధారము. ఈ రెంటియొక్కయుఁ బ్రతిషేధము సరిగా లేదు- ఎందులకనఁగా ఇట్లయినచో శూన్యవాద ప్రసంగము గాఁగలదు. అపరమార్థమును బాధించుట కాశ్రియమగు నొక పరమార్థ మవశ్యముగా నుండి తీరవలెను- "నేతి" "నేతి" అను దాని మూలమునఁ గార్యప్రతిషేధమే సంగతమై యున్నది- ఏమన? కార్యమనునది యసత్తును, గల్పితము, నై యున్నది- రజ్జువునందు సర్ప ప్రతిషేధ మగుచున్న ట్లుపదేశమువలన బ్రహ్మమునందుఁ గల్పింపఁబడిన యవస్తువుల ప్రత్యాఖ్యానము (కూడదని నిరాకరించుట) జేయుచు బ్రహ్మస్వరూపము ప్రతిపాదింపఁ బడినది- దీనిలో బ్రహ్మ మాధారముగా గల కార్యముయొక్క ప్రతిషేధమే చేయఁబడినది. బ్రహ్మము యొక్క ప్రతిషేధము (లేదనిచెప్పుట) చేయఁబడలేదు- ఎందుల కనఁగా బ్రహ్మమందే సకల కల్పనముల విస్తృతి గలదు- కల్పితము, నసత్తు నగు ప్రపంచము బాధిత మగును- సద్వస్తువగు బ్రహ్మము బాధితము గానేరదు-

అద్వైతవాదులు జగత్తునకు వ్యావహారిక సత్త గలదని యొప్పుకొనుచున్నారు- వ్యావహారికముగా జగత్తు సత్యమగును- కాని పరమార్థముగా సత్యముకాదు- పరమార్థవిషయమం దిట్లు చెప్పబడినది-

"ఏకరూపేణ హ్యవస్థితో యోర్థ స్సపరమార్థః"

ఏవస్తువు సర్వదా సర్వత్ర యొక్క రూపములోనే యుండునో యదియే సత్యమును బరమార్థము నై యున్నది- బ్రహ్మమెల్లప్పుడు నిర్బాధము, నేకము, నద్వితీయము, నై యున్నది. అందువలన బ్రహ్మమే పరమార్థమై యున్నది- ఈ విషయముంగూర్చి యిట్లు వ్రాయబడినది-

"ఏకత్వ మేవ ఏవం పారమార్థికం దర్శయతి"

ఏకత్వమే పారమార్థికము- నానాత్వము వ్యావహారికమై యున్నది- అద్వైత మతమునందు సత్య, మిథ్యా, లక్షణము లిట్లు చేయబడినవి- భూత, భవిష్య ద్వర్తమానములనెడి త్రికాలములలోను, జాగ్ర, త్స్వప్న, సుషుప్తి తురీయము లనెడి దశలలో నే వస్తువు నిర్బాధమై యొక్కరూపమునం దుండునో యదియే సత్య వస్తువు-తదితర మంతయు మిథ్యయై యున్నది. ఎట్లన-

"తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః
బ్రహ్మ వ్యతిరేకే న కార్యజాత స్యా భావః
వికారజాత స్యా నృతాభిధానాత్"

బ్రహ్మమే సత్యము- కార్యము మిథ్య ఎందులకనంగా కార్యము వికారమై యున్నది- వికారము మిథ్య, బ్రహ్మము కంటె వేరైన దేదియు లేదు- జగద్రూపముగా భ్రాంతియగు చున్నదంతయు బ్రహ్మమందు నామరూపభేదమాత్రమై యున్నవి- కుండలములు (పోగులు) వలయములు మున్నగు

నవి బాహ్యదృష్టిలో భిన్నముగా నున్నప్పటికిని బంగార మొక్కటియే యైనట్లు వైచిత్ర్య మయమైన ప్రపంచము బ్రహ్మమే యై యున్నది. ఇది కేవలము నామరూపముల యొక్క భేదము. వస్తుగతమగు తాత్త్వికభేద మేదియు లేదు-ఎట్లన-

"వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం"

మృద్వికారములగు కుండ, మూకుడు మున్నగువానియందు నామభేదమే కాని వాస్తవములో నవియన్నియు మృత్తే యై యున్నవి. వెండియు మృత్తే (మట్టి) సత్యమై యున్నది- ఎట్లన-

"అనేనైవ జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాత్"

పరమాత్మ, జీవరూపములోఁ బ్రవేశించి నామరూపముల భేదము గావించెను- "తన్నామ రూపాభ్యాం వ్యాక్రియత"

నామరూపముల మూలమునఁ బరమాత్మచే ద్వైతరూపమగు ప్రపంచము జనించినది- ఇట్లుపనిషద్వాక్యము వలన బ్రహ్మభావమును వదలి జీవభావమునకుఁ గాని జడమునకుఁ గాని పారమార్థిక సత్త లేదని సిద్ధించుచున్నది- అన్నిటి యొక్క సత్త వ్యావహారిక మగును- ఎవఁడు జీవుఁడో వాఁడే బ్రహ్మము. కేవలము నామరూప మయమగు మాయయొక్క విలాసముచే భిన్నత్వము ప్రతీతి యగుచున్నది-

మాయామయుఁడగు జీవునకు బ్రహ్మభావమును బొందించుటకై వేదాంత శాస్త్రమునందు మూడు విధములగు నుపాసనలు చూపఁబడినవి- ఎట్లన- (1) అంగావబద్ధము

(2) ప్రతీకము (3) అహంగ్రహములని. అంగావబద్ధమనెడి యుపాసనలో యజ్ఞాంగములందు బ్రహ్మభావన చేయబడు చున్నది- ఎట్లన-

"ఇదం ఉద్గీథం బ్రహ్మ ఇత్యుపాసీత"

ఇం దుద్గీథ మనఁగా యజ్ఞముయొక్క యంగవిశేషములో బ్రహ్మభావన యుపదేశింపబడినది. రెండవది ప్రతీకోపాసన; దీనిలో బ్రహ్మ భిన్నములైన పదార్థములందు బ్రహ్మభావన చేయఁబడుచున్నది-

"మనో బ్రహ్మ ఇత్యుపాసీత
ఆదిత్యో బ్రహ్మ ఇత్యుపాసీత

మనమునందు బ్రహ్మభావనజేసి యుపాసింపవలయును- సూర్యునియందు బ్రహ్మభావనగావించి యుపాసింపనగును- ఈ మున్నగునవి ప్రతీకోపాసనకు దృష్టాంతములు. మూఁడవది యహంగ్రహోపాసన. ఇదియే యద్వైత వాదుల యథార్థోపాసనమై యున్నది. దీనియందు "సోహం" అహం బ్రహ్మాస్మి" ఈ మొదలగునవి. జీవుఁడు బ్రహ్మమునుండి భిన్నుఁడు గాఁడను భావన వలన నుపాసన యగుచున్నది. ఎట్లన-

"ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ"

జీవాత్మయే పరమాత్మ. బ్రహ్మసూత్రమునందుఁ జెప్పబడిన యిట్టి మనన భావనములే యద్వైత వాదముయొక్క యుపాసనమై యున్నది. ఎట్లనగా-

"తం యథా యథోపాసతే తదేవ భవతి"

ఎవఁ డెవని నుపాసించుచున్నాడో వాఁ డవ్వాని రూపును బొందుచున్నాడు. కాబట్టి బ్రహ్మభావనా పరిపాకముచే సాధకుఁడు బ్రహ్మభావమును బొందుచున్నాడు. అప్పుడు వానికి సర్వ ప్రపంచము బ్రహ్మమయము గాఁగలదు. మరియు నిట్లు స్వరూప స్థితుడగు రాజయోగి యానందమయ మగు బ్రహ్మపదమునందుఁ బ్రతిష్ఠను బొందుచున్నాడు. స్వరూపస్థితుఁడగు నిట్టి రాజయోగి ప్రపంచమువైపు దృష్టి వేసి శిలలోఁ జెక్కఁబడిన మూర్తి శిలయైనట్లే యీ విచిత్ర మగు సర్వప్రపంచమును బ్రహ్మమయమని చూచును. వెండియు స్వరూపముగూర్చి భావన చేయుటచేత మాయాసృష్టుల కతీత మగు పరమ పదమును బొందును. ఇట్టి యోగులు ప్రపంచము నం దెంతవఱకు శరీర ధారులై యుందురో యంతవఱకు జీవన్ముక్తు లని యనఁబడుదురు జీవన్ముక్తుల సంస్కార విషయ మున బ్రహ్మసూత్రములం దిట్లు చెప్పబడినది.

"తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యప దేశాత్
ఇతరస్యాప్యేవం అసంశ్లేషః పాతేతు
అనారబ్ధ కార్యే ఏవతు పూర్వే తదవధేః"

బ్రహ్మ ముపలబ్ధ మైనందువలనఁ తత్త్వజ్ఞానియు, జీవన్ముక్తుండు నగు పురుషునియొక్క సమస్త సంచిత కర్మల వినాశ మును, చేయబడు కర్మములయొక్క అసంస్పర్శమును గలుగును. పద్మ పత్రమందు జల మంటనట్లు తత్త్వజ్ఞాని యగు పురుషునిఁగూడఁ గర్మముల నంటనేరవు. ఇతఁడు పాప

పుణ్యములనెడి రెంటిని దాటి యావల నుండును. కేవలి ప్రారబ్ధకర్మమే మిగులును. జీవన్ముక్తు డిద్దానిని ననుభవ మూలమున నశింపఁ జేయును ఎట్లన-

తస్య తావదేవ చిరం యావ న్న విమోక్ష్యే థ సంపత్స్యే

ప్రారబ్ధక్షయము సంపూర్ణముగాఁ గానంతవరకు జీవన్ముక్తుని శరీర ముండును. అటుతరువాత విదేహముక్తిదశ యందు జీవన్ముక్తుఁడు బ్రహ్మములోఁ గలిసి శరీరమును వదలి వేయును. బ్రహ్మ సూత్రమం దిట్లు చెప్పఁబడినది.

విదుష ఐకాంతికీ కైవల్య సిద్ధిః
బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి॥

బ్రహ్మజ్ఞానియొక్క యైకాంతికియగు కైవల్య సిద్ధి లేక విదేహముక్తి గాఁగలదు. బ్రహ్మము నెఱింగినవాఁడు బ్రహ్మ మగుచున్నాఁడు. ఇందుల కుపనిషత్తునం దిట్లు వ్రాయబడినది.

యథానద్య స్స్యందమానా స్సముద్రే స్తం గచ్ఛంతి నామరూపే విహాయ
తథా విద్వా న్నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యం

నదులు సముద్రునియందుఁ గలసిన తరువాత వానియొక్క నామరూపములును అస్తిత్వమును సముద్రములోనే యెట్లు లయించుచున్నవో యట్లే బ్రహ్మజ్ఞానియగు మహాత్ముఁడు నామరూపమయమగు జీవభావమును విడిచి బ్రహ్మానంద మహోదధిలోఁ దన యాత్మను లయింపఁ జేయుచున్నాఁడు. ఇదియే వేదాంత దర్శనమందలి సప్తమజ్ఞాన భూమియొక్క ముక్తి. ఉపాసనా భేదము ననుసరించి యీ ముక్తి రెండు

తెలుంగులఁ బ్రాప్తింపఁగలడు. నిర్గుణోపాసకుఁ డీప్రపంచ మందు బ్రహ్మజ్ఞానము బొంది జీవన్ముక్తి గల్గినమీద విదేహ ముక్తిని బొందఁగలఁడు.

"న తస్య ప్రాణా ఉత్క్రామంతి అత్రైవ సమలీయంతే"

బ్రహ్మజ్ఞానియొక్క ప్రాణము లుత్క్రాంతములు (పైకి లేచిపోయినవి) గావు. ఇందే విలీనము జెందఁగలవు. రెండవ వాఁడగు సగుణబ్రహ్మోపాసకుఁడు తన యిష్టదైవముతో సాలోక్య, సాయుజ్య, ప్రభృతి ముక్తులను బొందుచున్నాఁడు. ఇతఁ డుత్తరాయణగతిని బొంది క్రమముగా నూర్ధ్వలోకముల లోనికిఁ బోవుచుఁ దుదిని సప్తమ లోకమునఁ బ్రవేశింపఁగలడు అందు మహా ప్రళయము వఱకు నివసించి బ్రహ్మ (చతుర్ముఖ బ్రహ్మ) యొక్క దివావసానము (పగలు ముగియు తరుణము) నందుఁ బరబ్రహ్మములో విలీనము గాఁగలఁడు. ఎట్లన-

"బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే
పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పదం"

క్రమముక్తిని బొందిన తత్త్వజ్ఞానియగు మహాపురుషుఁడు కల్పాంతములో మహాప్రళయ సమయమందు విరించితోఁ కూడ బరమపదములో లయింపఁగలఁడు, ఈ మొదటిదియే సహజగతి. రెండవది క్రమోర్ధ్వగతి యని వేదాంతశాస్త్రమునందుఁ జూప బడినది.

సంగ్రహముగా సప్తదర్శనశాస్త్రముల తత్త్వము ప్రకటింపఁబడినది. వీనిసమన్వయము జ్ఞానభూమి ననుసరించి చెప్పఁబోవు సముల్లాసమందుఁ జెప్పఁ బడును. పూర్వోక్తములగు

సప్తదర్శనములు సప్తజ్ఞాన భూములతో సక్రమమగు సంబంధము గలిగియున్నవి.

సనాతనధర్మముయొక్క విజ్ఞానము ననుసరించి జీవుని యధఃపతితదశయొక్క యేడు జ్ఞాన భూములు స్వీకరింపబడి యున్నట్లే సాధకుని క్రమోన్నతియు సప్తజ్ఞాన భూములలో విభజింపఁబడి యంగీకరింపఁబడి యున్నవి. ఈ చెప్పబడిన సప్తజ్ఞాన భూములయొక్కయు వీని సప్తదర్శనములయొక్కయు ననుభవించు విషయములో మహర్షు లిట్లు వచించుచున్నారు.

"జ్ఞానదా జ్ఞానభూమే హీణా ప్రథమా భూమికా మతా
సన్న్యాసదా ద్వితీయా స్యా త్తృతీయా యోగదా భవేత్
లీలోన్ముక్తి శ్చతుర్థీ వై పంచమీ సత్పదా స్మృతా
షష్ఠ్యానందపదా జ్ఞేయా సప్తమీ చ పరాత్పరా
యత్కించి దాసీ జ్జ్ఞాతవ్యం జ్ఞాతం సర్వం మయేతి ధీః
ప్రథమో భూమికాయా శ్చానుభవః పరికీర్తితః
త్యాజ్యం త్యక్తం మయేత్యేవం ద్వితీయో నుభవో మతః
ప్రాప్యా శక్తి ర్మయా లబ్ధా నుభవో హి తృతీయకః॥
మాయా విలాసితం చైత ద్దృశ్యతే సర్వ మేవ హి

న తత్ర మేభిలాషాస్తి చతుర్థోను భవో మతః
జగద్బ్రహ్మే త్యనుభవః పంచమః పరికీర్తితః
బ్రహ్మైవ జగ త్షష్ఠో నుభవః కిల కథ్యతే॥
అద్వితీయం నిర్వికారం సచ్చిదానంద రూపకం

బ్రహ్మాహమస్మీతి మతి స్సప్తమో నుభవో మతః
ఇమాం భూమిం ప్రపద్యైవ బ్రహ్మసాయుజ్య మాప్యతే

మొదటి జ్ఞానభూమి జ్ఞానద, రెండవది సన్న్యాసద, మూఁడవది యోగద, నాల్గవది లీలోన్ముక్తి, యైదవది సత్పద యాఱవది యానందపద, యేడవది పరాత్పరయు నై యున్నది. తెలిసికొనఁదగిన దానిని నేను తెలిసికొంటి నను విచారము గల్గుట, ప్రథమ జ్ఞానభూమి యనుభవ మగును. త్యాగ మొనరింపఁదగిన దానిని నేను త్యాగ మొనరించితి నను విచారము ద్వితీయజ్ఞానభూమి యనుభవ మగును. పొందఁదగిన శక్తిని నేను పొందితి నను విచారము తృతీయజ్ఞానభూమి యనుభవ మగును. ఈ జగత్తంతయు మాయయొక్క విలాసరూపమై కనుపడుచున్నందున నిందు నాకెట్టి కోరికయు లేదను విచారము చతుర్థజ్ఞానభూమి యనుభవ మగును. జగత్తే బ్రహ్మమైయున్న దనునది పంచమ జ్ఞానభూమి యనుభవ మగును. బ్రహ్మమే జగత్తను విచారము షష్ఠజ్ఞానభూమి యనుభవ మగును. అద్వితీయంబును నిర్వికారంబును సచ్చిదానందరూపకము నగు బ్రహ్మము నే నగుచున్నానను విచారము సప్తమ జ్ఞానభూమి యనుభవ మగును. ఈ జ్ఞానభూమిని బొంది యే సాధకుఁడు బ్రహ్మసాయుజ్యమును బొందఁగలఁడు.

శ్రీ కృష్ణార్పణమస్తు.

ఓం తత్సత్.





# దివ్యవాణీ సుకృతి ప్రాసాదము

| | | | | |
|---|---|---|---|---|
| 1. వేద వేదాంగ చంద్రిక సుకృతి | 140 | పు॥ | రూ॥ | 1-0-0 |
| 2. దర్శనదర్పణము | ,, | 125 | ,, | 1-4-0 |
| 3. పురాణములు | ,, | 160 | ,, | 2-0-0 |
| 4. శ్రాద్ధములెందుకుబెట్టవలె | | | | 0-8-0 |
| 5. నమస్తేమీమాంస | | | | 0-2-0 |
| 6. దయానందకాకచ్ఛాచిత్రా | | | | 0-2-0 |
| 7. షోడశ సంస్కార మహిమ | | | | అచ్చులోనున్నది, |

## ♦♦)దివ్యవాణీ విజయసంచికలు(♦♦

| | |
|---|---|
| ప్రథమ విజయ సంచిక | 1-8-0 |
| ద్వితీయ ,, | 0-6-0 |
| తృతీయ ,, | 0-8-0 |
| చతుర్థ ,, | 1-0-0 |
| పంచమ ,, | 1-0-0 |

దివ్యవాణీ పత్రికకు చందాచెల్లించి చందాదారులుగానున్నవారికి విజయసంచికలు సగముధరకే చిక్కును. కొలది ప్రతులే కలవు. త్వరపడుడు.

## దివ్యవాణీ కార్యాలయము

2839 ఇమాంబావిడి బజారు, శికిందాబాదు.